


జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

రాజమహేంద్రవరము 16-1-1978 సంచిక 6


# సంక్రాంతి సంచిక




చందా

సంవత్సరమునకు రు 10-00.

అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

## —* ఈ సంచికలో *—



1—2—78 సంచికలో కవిత్వంలో వాస్తవికత; వేయిపడగలు, ప్రతీక - వ్యాసాలు ఉంటాయి.


అడ్రసు :—

సంపాదకుడు,

**బులుసు సీతారామశాస్త్రి,**

6-8-7, ఇన్నీసుపేట, రాజమండ్రి-1.

# కర్మసిద్ధాంతము

027,

— శ్రీ



సనాతన ధర్మ వైశిష్ట్యానికి కీలకమైన వాటిల్లో కర్మసిద్ధాంత మొకటి. ఆధునికులలో మన ధర్మ స్వరూపం తెలియనివారు దీన్ని పరమ తీవ్రంగా నిందిస్తున్నారు. ఇప్పుడు మన మనుభవిస్తున్న అనర్థాల కన్నింటికీ ఇదే హేతువని కూడా వాదిస్తున్నారు. కర్మ సిద్ధాంతాన్ని గూర్చిన నింద లూహాజన్యా అవిచారమూలకమని నిరూపించడమే ఈ వ్యాసానికి లక్ష్యం.

"ప్రపంచమతాల్లో ఏమతమూ చెప్పని సిద్ధాంతాన్ని ఈ వేదధర్మం చెప్తోంది కాబట్టి దీన్ని నమ్మగూడదు." తక్కిన మతాలు చెప్పేవాటినే ఇదీ చెప్తే ఇది విశిష్ట ధర్మమే కాదన్న ఊహ ఇట్టివాదం చేసేవారికి కలగదు. ఎవ్వరూ చెప్పలేనిది ఇది చెప్తోంది కాబట్టే ఇది విశిష్టమవుతోంది. పైగా ఈ సనాతనధర్మం ఒకరితో మొదలైనదికాదు. ఎల్లప్పుడూ ఉంటున్నది. తక్కిన మతాలు ఆయామత ప్రవక్తలతో ఆరంభమైనవి. ఆయా ప్రవక్తలు పుట్టకముందు అవిలేవు. ఆ ప్రవక్తల మతాలన్నీ తమకు ముందున్న సనాతనధర్మంలో తమ తమ బుద్ధులకు నచ్చిన కొన్నింటికి ప్రాముఖ్య మిచ్చి వారి వారి అనుయాయులకు చెప్పారే కాని ఇందులో లేని కొత్తవిషయాలను వారెవ్వరూ చెప్పలేదు. అందుచేతనే సనాతనధర్మం విశ్వధర్మమని విజ్ఞులు వేనోళ్ళ ప్రశంసిస్తున్నారు.

"ఈ కర్మ సిద్ధాంతం లేకపోతే భారతీయు లీదుర్గతికి దిగజారే వారుకారు. ప్రతిదాన్నీ కర్మ కర్మ అనుకుంటూ అనుభవించడానికి సిద్ధపడడమే తప్ప ప్రతిక్రియ చేసి బాగుపడదా మన్నదృష్టి భారతీయులలో వ్యాప్తం కావడానికి ఈ సిద్ధాంతమే హేతువు."

కర్మ సిద్ధాంతం పురుషకారాన్ని నిరసిస్తోందన్న దుర్భ్రమవల్ల ఇట్టి విమర్శ చేస్తున్నారు. అసలా సిద్ధాంతం వెలువడినదే పురుషకారాన్ని ప్రబోధించడానికి. దాన్ని విపరీతంగా అన్వయించుకోవడం మన తెలివితక్కువ. నీవు వెనుక చేసుకున్నదే ఇప్పుడనుభవిస్తావంటే ఇప్పుడు చేసుకోవద్దని చెప్పినట్లా? ఎంత చదివిన వానికి అన్నిమార్కులు వస్తాయంటే చదవనిదే రావు కాబట్టి చదవవద్దని చెప్పినట్లా? చేసుకోందే అనుభవించలేము కాబట్టి చేసుకోవాలి. ఏదిచేస్తే అదే అనుభవిస్తాము కాబట్టి ఏమి కావలెననుకుంటున్నామో దానికి తగినదాన్నే చేసుకోవాలి. ఎంత చేసుకుంటే అంతే అనుభవిస్తాము కాబట్టి చేసుకున్న వారికీ చేసుకున్నంతా మహాదేవా అనుకోవడం!

వెనుకటి కొక బ్రాహ్మణుడు యాయవారానికి వెళ్తే ఒకపల్లెటూరి గృహస్థు 'మూడుజన్మల దరిద్రుడు వచ్చాడు ముష్టిపెట్టవే' అని ఇల్లాలిని కేకవేశాడుట. ఆ మాట వింటూనే యాయవారపు బ్రాహ్మడికి కోపంవచ్చి 'మీ రెంత సంపన్నులయితే మాత్రం అలా నిందిస్తారెందుకు' అన్నాడట. దానిమీద ఆ గృహస్థు 'అవునయ్యా వెనుకటిజన్మలో నీవు దరిద్రుడవై ఎవ్వరికీ పెట్టలేదు. అందుచేతనే ఈజన్మలోనూ దారిద్ర్యం వచ్చింది. ఇప్పుడూ ఎవ్వరికీ పెట్టలేకపోతున్నావు గదా. అందుచేత వచ్చేదీ దరిద్ర జన్మే అవుతుంది. ఉన్నమాట అంటే ఉలిక్కిపడతా వెందుక?' అని అడిగాడట. కాబట్టి ఎంత దారిద్ర్యంలోనయినా నాకే లేనప్పుడు నేనేం చేస్తా నని ఊరుకోక ఉన్నంతలో వీలైనంత పుణ్యం చేసుకుంటేనే ముందుజన్మలో అను భవానికి వస్తుందని తాత్పర్యం.

"అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాఽశుభమ్" మంచిగాని చెడుగాని చేసుకున్న కర్మఫలాన్ని అనుభవించక తప్పదు. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" ప్రారబ్ధ కర్మఫలము అనుభవముతోనే నశిస్తుంది. ఇలా చెప్తున్న మన శాస్త్రాలే ఫలానుభవం నుండి తప్పించుకునే ఉపాయాలున్నవని, వాటి నవలంబించే స్వాతంత్ర్యం మనకున్న దనీ కంఠోక్తంగా చెప్తున్నాయి. ఈ స్వాతంత్ర్యం మనకు లేనిపక్షంలో ఆశాస్త్రాలు ఎవరికోసం ప్రవర్తించినట్లు? పశుపక్ష్యాది శరీరాలు కేవల పాపానుభవానికే ఉద్దిష్ట మైనవి. సిద్ధ సాధ్య గంధర్వాది దేవయోని విశేషాలు కేవల పుణ్యానుభవానికే ఉద్దిష్టములైనవి. ఈ రెండువర్గాలవారికే స్వాతంత్ర్యంలేదు. అంటే పాపాన్నో పుణ్యాన్నో అనుభవించడం తప్ప ఆ శరీరాలలో వారు చేయగలిగింది మరేమీ లేదు. అవి ఒకరకంగా జైలు జీవితాలవంటివి. కఠినవరకం పశుపక్ష్యాది జన్మలయితే అన్ని సౌకర్యాలతోనూ ఉండే 'ఏ' క్లాసు జైలువంటివి దేవయోని విశేషాలు. ఆజీవితాలు గడుపుతూవారు కొత్తగా సంపాదించుకొనే పాపపుణ్యాలు ఉండవు. ముక్తిని పొందే ప్రయత్నం చెయ్యడానికీ అవకాశం లేదు. అందుచేతనే 'జంతూనాం నరజన్మ దుర్లభ'మని ఆదిశంకరులు కంఠోక్తిగా చెప్పారు.

మానవులు పుణ్యపాప సమ్మిశ్రఫలమైన జన్మలు కలవారు. ఈ జన్మలో వీరిక యుక్తాయుక్త విచక్షణ చేసుకునే మనసు అనుగ్రహింపబడింది. భగవంతుడిచ్చిన ఆ మనస్సు నుపయోగించుకోక తెలిసి తెలిసి పాపాలుచేసి పశుపక్ష్యాది జన్మలూ పొంద వచ్చు. సుఖభోగాపేక్షతో పుణ్యాలుచేసి దేవయోనులలోనూ పుట్టవచ్చు. తత్త్వం తెలుసుకొని పుణ్యపాపాల కతీతమైన బ్రతుకులు గడిపి జ్ఞానాగ్ని దగ్ధకర్ములై జన్మ రాహిత్యాన్నీ సాధించుకోవచ్చు. ఈ స్వాతంత్ర్యం ఉన్నది కాబట్టే మానవజన్మ పరమ దుర్లభమనీ సర్వోత్కృష్టమనీ మనశాస్త్రాలు చెప్తున్నాయి.

జీవుడనాది. అతనికి జననమరణాలు లేవు. శరీరాలు ధరిస్తున్నాడు. విడిచి పెడ్తున్నాడు. పాతశరీరాన్ని విడిచినప్పుడు చచ్చాడనీ కొత్త శరీరాన్ని ధరించినప్పుడు పుట్టాడనీ అంటున్నాము. శరీరాలకుండే జనన మరణాలను అతనికి చెందినట్లుగా భ్రమిస్తున్నాము. ఈ భ్రమకు అజ్ఞానమే కారణం. శరీరాన్ని పొందవలసిన జీవునకు అనేక జన్మలలో ఆర్జించుకొన్న పుణ్యపాపాలు గుట్టలు గుట్టలుగా పేరుకొని ఉంటాయి. దాన్ని సంచిత కర్మ అంటారు. ఆ కర్మ నంతటినీ అనుభవించడానికి ఎన్నో జన్మలెత్తవలసి ఉంటుంది. రకరకాల కర్మలకు రకరకాల శరీరాలు పొందవలసి ఉంటుంది. అందులోనుంచి ఈశ్వరుడు ఈ జన్మలో అనుభవించవలసిన కర్మను కేటాయించి దాని కనుగుణమైన శరీర మిస్తాడు. కేవల పాపకర్మానుభవానికైతే పశుపక్ష్యాది శరీరాలనూ, కేవల పుణ్యకర్మానుభవానికైతే దేవయోని విశేషాలనూ, పుణ్యపాపసమ్మిశ్రమాలకైతే మనుష్యజన్మనూ ఇస్తూంటాడు. ఇలా ప్రస్తుతజన్మలో అనుభవించడానికి ఉద్దిష్టమైన కర్మకే ప్రారబ్ధమని పేరు. ఇది అనుభవించక తప్పనిసరి అయినది. అనుభవంవల్లనే నశించవలసినది. దీన్ని అనుభవిస్తూ ఈ జన్మలో మనుష్యుడు చేసుకునే కొత్త కర్మలుంటాయి. ముందు ముందనుభవించవలసిన అట్టి పుణ్యపాపకర్మకే ఆగామి అని పేరు.

మనుష్యుడు ఆత్మజ్ఞానాన్ని సాధించి సంచితాన్నంతటినీ దగ్ధంచేసుకోవచ్చుననీ ఆగామి కర్మ ఏర్పడకుండా పుణ్యపాపాల కతీతంగా బ్రతకవచ్చుననీ మన శాస్త్రాలు చెప్తున్నాయి. ప్రారబ్ధంకూడా మూడువిధాలుగా ఉంటుంది. స్వేచ్ఛాప్రారబ్ధం, పరేచ్ఛాప్రారబ్ధం, అనిచ్ఛాప్రారబ్ధం, అని మూడువిధాలు. ప్రారబ్ధం చెయ్యగలిగేది ఇచ్ఛను పుట్టించడం వరకే. పూర్వకర్మ ననుసరించి మనకు మంచిబుద్ధిగాని చెడు బుద్ధిగాని కలుగుతూ ఉంటుంది. అందుకే 'బుద్ధిః కర్మానుసారిణీ' అంటారు. 'వినాశకాలే విపరీతబుద్ధిః' అన్నదీ ఇటువంటిదే. దీనికే స్వేచ్ఛాప్రారబ్ధం అని పేరు. బుద్ధిని పుట్టించడంతోనే ఆ ప్రారబ్ధం తీరిపోతుంది. దాన్ని ఆచరించడంగాని ఆచరించకపోవడం గాని మనసున్న మానవుని అధీనంలో ఉన్నది. కర్తుం (చెయ్యడానికి) అకర్తుం (చెయ్యకపోవడానికి) అన్యథాకర్తుం (మరొకరంగా చెయ్యడానికి) ఈ మానవున కవకాశం ఉన్నది. ఈ స్వాతంత్ర్యం మనకున్నట్లు మన నిత్యజీవితంలో మన అనుభవం లోనే ఉంటున్నది. ఎన్నోసార్లు మనకు చెడ్డబుద్ధులు పుడ్తూ ఉంటాయి. ఎవరినో తిట్టాలనీ కొట్టాలనీ అనిపిస్తూనే ఉంటుంది. అట్లా అనిపించినంత మాత్రాన సంస్కారి అయిన మానవుడు తొందరపడిపోవడంలేదు. సాధకబాధకాలాలోచించి తన్ను తాను అదుపులో పెట్టుకుంటున్నాడు. అట్లాగే మంచిబుద్ధులూ పుడ్తుంటాయిగాని వాటిని మన మొకప్పుడు ఆచరణలో పెడ్తాము, మరొకప్పుడు పెట్టము. ఇందుకే పెద్దలు చెడ్డబుద్ధి పుడ్తే నిదానించు, మంచిబుద్ధిపుడ్తే వెంటనే ఆచరించు అని సలహా ఇస్తారు.

మనబుద్ధి ప్రేరితమవుతున్నట్లే ఇతరుల బుద్ధులూ ప్రేరితములవుతున్నాయి. మన ననుసరించికాక ఇతరులతో మనకున్న సంబంధాలను బట్టి వారి ఇచ్ఛల ననుసరించి మన మొకప్పుడు మంచి చెడ్డలలో పాల్గొంటూ ఉంటాము. దాన్ని పరేచ్ఛా ప్రారబ్ధ మంటారు. వీటిల్లో తారతమ్యాలుంటాయి. బలీయమైనవాటిని ఎవ్వరూ తప్పించుకోలేరు. అనిచ్ఛాప్రారబ్ధం అంటే ఎవరి ఇచ్ఛతోనూ సంబంధం లేకుండా దానంతటది వచ్చి నెత్తినిపడేది మన అధీనంలో లేనేలేదు. కాగా అనుభవించక తప్పనిసరి అన బడే ప్రారబ్ధంలో కూడా మూడింట రెండువంతుల్లో అత్యధిక భాగాన్ని వృత్తిపుట్టడం మాత్రంతో తప్పనిసరిగా అనుభవించి తరువాతి ఫలితం లేకుండా చేసుకునే అవకాశం మనకు ఉన్నది.

ఈబుద్ధి వృత్తులతో పాటు మనతల్లిదండ్రులు, మనంపుట్టిన వాతావరణం, మన కుండే సంపద్దారిద్ర్యాలు, మనంతినే తిండి ఇత్యాదిగా ఇప్పటి శరీరంతో మనమనుభవించే సమస్తానికీ ప్రారబ్ధమే హేతువు. అందుచేతనే 'ప్రారబ్ధం పుష్యతి వపుః' అని నిశ్చింతులై విరక్తు లుండగలుగుతున్నారు.

అహంకార విరహితులమై దేహేంద్రియాదులతో తాదాత్మ్యం చెందక తద్వ్యతిరిక్తప్రత్యక్స్వరూపులమే మనమని తెలిసి శరీరం ధరించాము కాబట్టి అది యేపనికై పుట్టినదో ఆపనిని ఈశ్వరాజ్ఞా విధేయులమై నిర్వహించడంలో నిస్సంగులమై ఫలత్యాగపూర్వక స్వధర్మానుష్ఠాన పరులమై బ్రతకడంవల్ల చిత్తశుద్ధి ఏర్పడి మోక్షహేతువైన జ్ఞానం కలిగి సంచితం తగులబడిపోయి ఆగామి ఏర్పడక ముక్తులము కాగలము అని మనశాస్త్రాలు మనకు చెప్తున్నాయి.

నియతం కురు కర్మత్వం
కర్మ జ్యాయో హ్యకర్మణః
శరీర యాత్రా పిచ తే
న ప్రసిద్ధ్యే దకర్మణః॥

నీకు నియతమైన కర్మ నీవు చెయ్యి. కర్మ చేయకుండా ఉండడం కంటె చేయడమే శ్రేష్ఠం. కర్మ చెయ్యని వానికి దేహయాత్ర కూడా సాగదు.

నహి కశ్చిత్ క్షణ మపి
జాతు తిష్ఠ త్య కర్మ కృత్
కార్యతే హ్యవశః కర్మ
సర్వః ప్రకృతి జైర్గుణైః ॥

ఏ కర్మా చెయ్యకుండా క్షణం సేపైనా ఎవ్వరూ ఉండలేరు. ప్రకృతి గుణాల ప్రాబల్యం వల్ల కర్మలు జరుగుతూనే ఉంటాయి.

కర్మేంద్రియాలను మాత్రం నియమించి మనస్సుతో విషయాలను స్మరిస్తూనే నేనేమీ చెయ్యడం లేదనుకునే వాడు వట్టి మిథ్యాచారి. వాడికి ఇహపరాలు రెండూ ఉండవు. ఎవడు మనసుతో జ్ఞానేంద్రియాలను నియమించి తన విధిని తాను తెలుసుకుని ఫలాపేక్షా విరహితుడై కర్మేంద్రియాలతో అన్ని పనులు చేస్తూ ఉంటాడో వాడే శ్రేష్ఠుడు.

'మా తే సంగో స్త్వ కర్మణి'. ఏ పనీ చేయకుండా ఉండాలనే సోమరితనం మీద నీకు ఆసక్తి కలుగకుండును గాక.

ఇలా అనేక విధాల కర్తవ్య నిష్ఠను భగవద్గీత మనకు బోధిస్తూ ఉంటే తత్ప్రతిపాదితమైన కర్మ సిద్ధాంతం మనకు హాని ఏమి కలిగించింది? శత్రువులు దేశం మీదికి దండెత్తివస్తే ఎదుర్కొని పోరాడ వద్దన్నదా? 'ఆతతాయిన మాయాన్తం హన్యాదేవా విచారయన్' ఉద్యతాయుధుడై చంపడానికి వస్తున్న వ్యక్తిని వాడెవ్వడన్న విచారణ చెయ్యకుండా చంపవలసినదే అని మనుస్మృతి చెప్పిన దాన్నే భగవద్గీతా చెప్పింది. అందుచేత సిద్ధాంతంలో ఏ లోపమూ లేదు. దాన్ని సరిగా అవగాహన చేసుకుని పాటించకపోవడంలో మనయందే లోపం ఉన్నది. అందుకనే వివేకానందుడు 'కృష్ణుడు చెప్పినట్లు నడుచుకోక భారతీయులు చెడిపోయారు. క్రీస్తు చెప్పిన దాన్ని వ్యతిరేకించి పాశ్చాత్యులు బాగుపడ్డారు' అని అనవలసివచ్చింది.

కర్మ సిద్ధాంతం వల్ల ఏ హానీ లేదు సరిగదా ప్రపంచ మతాల్లో ఏ మతమూ సమర్థించలేక పోతున్న జీవ వైచిత్ర్యాన్ని అదొక్కటే సమర్థించ కలుగుతోంది. అంతా ఒకటే అంతా ఒకటే అని మన్ని మనం మభ్యపెట్టుకున్న మాత్రాన అది నిజం కాదు. పుట్టుకయందే వ్యక్తి వ్యక్తికీ ఎంతో వ్యత్యాసం ఉంటోంది. శరీర స్వరూప స్వభావాల్లోనే విస్పష్టమైన వైవిధ్యం శక్తిసామర్థ్యాల్లో వైవిధ్యం ఊహకే అందదు. పెరిగాక సంఘంలో ఉన్న వ్యత్యాసాలకు రకరకాల హేతువులు ఊహించే మేధావులు జన్మతః వస్తున్న వ్యత్యాసాలకు ఏ హేతువులు చెప్పగలరు? ఒకడు గర్భదరిద్రునకు పుడితే మరొకడు కోటీశ్వరునకు పుడుతున్నాడు. ఒకడు పండితునకు శుంఠగా పుడుతుంటే మరొకడు మూర్ఖునకు మేధావిగా పుడుతున్నాడు. ఒకడు అందగానికి కురూపిగా పుడుతుంటే మరొకడు కురూపికి అందగాడుగా పుడుతున్నాడు. వద్దనుకునే వారికి పిల్లలు పుడుతుంటే కావాలనుకునే వారికి కలగడం లేదు. ఆయా జీవుల కర్మ ఫలాలు కాకపోతే వీటన్నింటికీ ఏది హేతువవుతుంది? ఈశ్వరుడు కర్మ ఫల ప్రదాత మాత్రమే. ఆయన కర్మ సాపేక్షుడయ్యే ఉంటున్నాడు. ఆ నియ

మం ఆయన పెట్టినదే కాబట్టి అందువల్ల ఆయన స్వాతంత్ర్యానికి ఏ భంగమూ ఉండదు. ఆయన కొకరు ప్రియులు కారు ఒకరు అప్రియులు కారు. ఆయన సర్వసముడు. ఎవరి కర్మ ఫలాలను వారిచేత అనుభవింప చేయించడంలోనే ఆయన సర్వసమత్వ మంటోంది. ఆయన పరమ దయాళువు. కాబట్టే మన మన కర్మలకు తగ్గ శరీరాలను మన కనుగ్రహిస్తున్నాడు. తన దగ్గరకు చేరుకునే ఉపాయం చెప్పి రండని ప్రేమతో పిలుస్తున్నాడు. పిలుపు విని భక్తిశ్రద్ధలతో ఆరాధిస్తే అన్ని కష్టాలనూ అతిక్రమించి నిశ్చింతగా చేరుకోగలం !

ఈ సిద్ధాంతాన్ని నమ్ముతున్నంతకాలం భారతీయులు తమ సుఖ దుఃఖాలకు తామే కారకుల మని తెలుసుకొని ఎవరినీ నిందించక బాధ్యతతో ప్రవర్తించి తమ్ము తాము బాగుచేసుకుంటూ అభ్యుదయాన్ని పొందుతూ ఉండేవారు. పారమార్థికంగానే కాక ఐహికంగా కూడా అష్టైశ్వర్యాలతోనూ సుఖ శాంతు లనుభవించేవారు. సర్వ ప్రపంచానికీ గురుస్థానంలో ఉండి ఆరాధింప బడేవారు. చార్వాక సిద్ధాంతాలతో పరధర్మ మోహితులమై స్వధర్మచ్యుతి నందిన తర్వాతనే సర్వానర్థాలకూ ఆహుతి అవుతూ వచ్చాము. రాజకీయ స్వాతంత్ర్యం సాధించుకున్న తర్వాతకూడా స్వధర్మ ప్రాశస్త్యాన్ని గుర్తించి అనుష్ఠించక పరధర్మాలను అవలంబిస్తూ అనర్థాల పాలు అవుతూనే ఉన్నాము.

గీతలో శ్రీకృష్ణ పరమాత్మ ప్రబోధించినట్లు

కర్మణో హ్యపి బోద్ధవ్యం
బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణ శ్చ బోద్ధవ్యం
గహనా కర్మణో గతిః ॥

శాస్త్ర విహిత కర్మల తత్త్వం తెలుసుకోవాలి. అది నిషేధించిన కర్మల తత్త్వమూ తెలుసుకోవాలి. నైష్కర్మ్య తత్త్వం అంటే ఏ కర్మలు చేసినప్పటికీ చెయ్యనట్లే అయి ఇహానికి భంగం లేకుండా ముక్తికి దారితీస్తాయో ఆ తత్త్వమూ తెలుసుకోవాలి. కర్మల నడకలు అంతంత మాత్రాన తెలిసేవి కావు. మనం నమ్మినా నమ్మకపోయినా జగత్తు ఈ సిద్ధాంతం ప్రకారమే నడుస్తోంది. భగవంతుడిచ్చిన బుద్ధిని ఉపయోగించుకుని యథేచ్ఛా చారులం కాక శాస్త్ర దృష్టితో వివేకులమై సంచరిస్తే ఐహికాముష్మి కాభ్యుదయాల నవలీలగా అందుకోగలము.

* * *

# చరిత్రగతిని మార్చిన ఆయుధాలు

అనువాదకులు : శ్రీ సి. నరసింహాచార్యులు, ఎం. ఏ., ఎం. యిడి., బి. ఎల్.
మూల రచన : కీ. శే. డాక్టరు డి. యస్. రాజు (కల్నలు రాజు)
మాజీ కేంద్ర ఉపమంత్రి.

( గతసంచిక తరువాయి )

చరిత్రయుగమున ప్రప్రథమముగా యథార్థసంగ్రహ మూలమున మనకు లభ్యమగు సమాచారము ననుసరించి అజాతశత్రుడు (క్రీ॥పూ॥ 501) మగధసామ్రాజ్యమునకు చక్రవర్తియైన బింబిసారుని పుత్రుడు. ఆతడు ఆయుధసహితముగా నిర్మితమైన రథావళి (ఆధునిక టాంకులకు ప్రథమరూపము) నుపయోగించెను. ఈరథములపై వడిసెలరాళ్ళను ప్రయోగించు యంత్రములెన్నో అమర్చబడియుండెను. ఈ రథములతో నాతడు యుద్ధముచేసి "లిచ్ఛవిగణతంత్రరాజ సమాఖ్యపై సంపూర్ణవిజయమును గాంచెను. అజాతశత్రుడు తన రథమునకు నాల్గువైపుల సునిశితమైన ఉక్కురేకులను అమర్చి వాటిని శత్రుసమూహముల మధ్యకు ప్రయోగించెను. తనరథములకే ఒడిసెలను నిర్మించెను. ఈవిధముగ మహా మేధస్సుతో కూర్చిన యీరెండు నిర్మాణములే ఆయనకు విజయమును సమకూర్చెను.

అలెగ్జాండరు మహావీరుడు మనదేశముపై దండెత్తినపుడు (క్రీ॥ పూ॥ 326 జూలై) పోరస్ మహారాజు (పురుషోత్తముడు) ప్రయోగించిన ఆయుధముల కెన్నో రెట్లు మిన్నయైన ఆయుధములతో గ్రీకు సైన్యము రణమొనరించినట్లు ఉదాహరణలకు కొదువలేదు. ధైర్యసాహసములలోను, శౌర్యబలములోను, సంఖ్యాబలములోను ఇరుపక్షములవారును ఒకరికొకరు సరిపడియుండిరి. కాని గ్రీకు సైనికులు ఉక్కుతీగలతోడి శరీరత్రాణములను ధరించి రక్షణపొందిరి. వారిబల్లెములు ఇరువదైదు అడుగుల పొడవుండెను. పోరసు (పురుషోత్తముని) సైనికుల కట్టి శరీరరక్షణ కొదువపడినది. వారి బల్లెములుకూడ శత్రువుల బల్లెములలో సగము పొడవు మాత్రమేయుండెను. అంతేకాక అలెగ్జాండరు అశ్వికదళము పురుషోత్తముని దళముకన్న అతి-చురుకుగలదై త్వరితగతిని పురోగమించగా పోరస్ గజదళము వెనుకబడియుండెడిది. అంతేకాక వీరి రథములు మట్టిలో కూరుకొని పోయెడివి. ఈవిధముగా నొక్క-దినములోనే యుద్ధము ముగియుటయు, పోరస్ అపజయమును ఫలితము లయ్యెను.

తరువాతి చంద్రగుప్తమౌర్యుని కాలమున (క్రీ॥ పూ॥ 322 నుండి 298 వరకు) నాతడు తన బ్రాహ్మణ మంత్రివర్యుని సహాయమున మనదేశమున ప్రథమముగా సువిశాల సామ్రాజ్యమును నిర్మింపగల్గెను. వారిరువురును వివిధ ప్రదేశములలో యోధులైన యనేక జాతులవారి నోడించి వశపరచుకొని, దేశమునంతను సమైక్యపరచి మహాజనావళి కంతకు శాంతియు సంపూర్ణ భాగ్యభోగ్యములను సమకూర్చిరి. వీరిరువురు ఈ

మహాకార్యసాధనకు యుద్ధసాధనమునుగాక రాజకీయతంత్రజ్ఞతనే యుపయోగించిరి. చంద్రగుప్తుడు తనపరిపాలనను తన పుత్రుడగు బిందుసారున కప్పగించినపుడు, ఆరులక్షల కాల్బలమును, రెండులక్షల అశ్వికదళమును, పదివేల యుద్ధగజదళమును, స్థిరబలమున నుండెను. మహాసైన్యమును పోషించుటచే వ్యయము చాలభాగము తగ్గుననియు, దానికి కారణమేమన యుద్ధములు చేయవలసిన అవసరము చాలవరకు తగ్గిపోవుటయేయనియు నీతడే ప్రప్రథమముగా సిద్ధాంతమును వెలువరించెను. యుద్ధసైనికులు ఎట్టి ఆయుధముల నుపయోగించిరో మనకు సరియైన సమాచారము కానరాకున్నది. చంద్రగుప్తమౌర్యుని మనుమడు అశోకుని సామ్రాజ్యము క్రీ॥ పూ॥ 270 నుండి 232 వరకున్న సామ్రాజ్యములన్నిటిలోను పెద్దది. ఆతడు తన పరిపాలన కాలమున తొమ్మిదవ సంవత్సరమున గావించిన కళింగయుద్ధమే తుదిది. దాని తరువాత నాతడు యుద్ధసన్యాసమును చేసి బలప్రయోగమునకే స్వస్తి చెప్పెను. ఆతడు ధర్మరాజ్యసంస్థాపన గావించెను. దానికి ప్రేమ, భూతదయ, న్యాయము, కరుణ సహనభావములతో నితరుల నర్థము చేసికొనుట యనునవే ఆదర్శసూత్రములై మార్గదర్శకము లయ్యెను. ఎంతో కాలమునకు పూర్వమే, అంతటి మహాచక్రవర్తి, ఆఫ్ఘనిస్తాన్ మున్నగు రాజ్యములతో గూడిన మహాసామ్రాజ్యమును ప్రేమ కరుణ సూత్రములపై నాధారపడి పరిపాలించు నాదర్శభావములను మనోదృష్టిని వీక్షించి కార్యరూపము నొందించుట మహాశ్చర్యము. తన శిలాశాసనములందును, గుహాశాసనములందును, పదే పదే "తన సామ్రాజ్యమునందలి ప్రజలేకాక, విశ్వమునందలి ప్రజలందరును తన తనూజులే." యని బాహాటముగా ప్రకటించెను. నిజమైన విజయసంపద ఒక్క ప్రేమవలన మాత్రమే లభించునని ఆతడు భావించెను. కాని ఈమహాసమ్రాట్టు తుదిదినములు దుఃఖమయము లని చెప్పబడుచున్నది. తన సామ్రాజ్యమును తనమనుమడైన 'సంప్రతి'నకు వశపరచెను. కాని ఆతడు నిర్వీర్యుడై యసమర్థుడైనవాడు. అధిక సమర్థులైన తన బ్రాహ్మణమంత్రుల చేతులలో నాతడొక కీలుబొమ్మ యయ్యెను. ఆమంత్రులు బౌద్ధమతమును అణగద్రొక్కుటకై ప్రయత్నించిరి. ఒకదినమునకు అరబౌన్నపాత్రమే ఆహారమును చక్రవర్తి కిచ్చుచుండిరి. ఒకనాడాతడు తనదర్బారు ప్రజలతో "అత్యధిక విస్తారమైన మహాసామ్రాజ్యమునకు చక్రవర్తినై అరగొట్టెకైన నోచుకోనైతిని గదా" యని మహావ్యథతో వాపోయెనట. అంతటి దైన్యముతో నాతడు విలపించెననగా నెంతటి నిస్సారస్థితి కాతడు క్రుంగిపోయి యుండెనో మన మూహింపగలమా!

తరువాత ద్విశత (200) సంవత్సరాయతమైన గుప్త సామ్రాజ్యమున (300-500) హర్షవర్ధన చక్రవర్తి పాలన (606-643) జరిగెను. ఈ చక్రవర్తి యుద్ధాయుధములను గూర్చి మనకు సమగ్రముగ తెలియుట లేదు. కాని యుద్ధమున రథములు క్రమక్రమముగా త్యజింపబడినవి. యుద్ధములలో వాటి సారథ్యము చేయుట వారికి వశము కాకుండెను. యుద్ధగజములుకూడ నిరుపయోగములుగనే నిర్ణ

# గ్రంథసమాలోచన

## వైజయంతి

— శ్రీ ప్రసాద్.

[ (సాహిత్య విశిష్ట సంపుటి) సంపాదకుడు శ్రీ కర్రా చంద్రశేఖరశాస్త్రి గారు, అగ్రహారము, సామర్లకోట. మూల్యము :- అయిదు రూపాయలు. ]

సంపాదకులు ప్రాచీనుల కవిత్వముపై తల మున్కలుగా నున్న విశేషాభిమానమున నేడాది కొక కవిపై రెండు సంపుటముల చొప్పున వెలువరింప దలంచినట్లు, ప్రాచీన కవుల గుణ విశేషాదు లర్వాచీన వర్ధమాన కవుల కుపకరింప వలయునను సదుద్దేశమున నిట్లారంభించినట్లు, చెప్పికొనిరి. వీరీ కార్యక్రమమును శ్రీనాథునితో నారంభించిరి. బహుశః శ్రీనాథునికి ముందువా రర్వాచీనుల కుపేక్షణీయులో, సులభ గుణ సంపన్నులో కాగలరను నుద్దేశము కానోపును. ఇట్టి స్థితికి నన్నెచోడుడు మొదలుకొని శ్రీనాథుని వరకు నున్న కవులు వచ్చుట వారి యదృష్టము. "శ్రీకారము గల శ్రీనాథుడు నా యీ ఉద్యమమున కాధారమైనా" డని చెప్పుట విచిత్రముగా నున్నది. శ్రీనాథుండే కాదు శ్రీశ్రీ వరకు నందరు నాకు సమర్చనీయులే యనుట విచిత్రమై విపరీతార్థము నిచ్చుచున్నది. ఇది శ్రీనాథాంకములో తొలి సంపుటి యనిరి. 'వైజయన్తి'లో నంక విభాగము స్ఫూర్తిదముగా లేదు. వైజయంతికి పతాక మను నర్థము వీరు గ్రహించి యుండిరి కదా!

ఇందు శ్రీనాథు నుద్దేశించిన వ్యాసములు, పద్యములు, ననువిభాగములు పదునారున్నవి. శ్రీనాథు నుద్దేశించి శ్రీ చెళ్లపిళ్ల వారి నుండి శ్రీ ద్వాభాష్యం వెంకటరావుగారి వరకు రచించిన రచనలున్నవి. శ్రీనాథు నుద్దేశించిన యీ రచనలను- (1) ఇందు కొఱకై రచింపబడినవి; (2) పూర్వము రచించిన శ్రీనాథోద్దిష్టములు ప్రకృత మందతర్భాగములైనవి; యని రెండు విభాగములుగ జేయవచ్చును. శ్రీనాథు నుద్దేశించి రచితములై ప్రకటితములైన వాని నిందు మరల ప్రకటించుటలో సుప్రయోగమే మున్నది? (శ్రీ చెళ్లపిళ్ల వారి శ్రీనాథుడు శ్రీరాముడు కాడు-విడిచిన) చర్విత చర్వణము, పిష్టపేషణము. ఒక కవిని గుఱించి, అతని గుణాదికమును గూర్చి వివరించుటకు పద్యముకన్న గద్యమే విశాలతరము ఉపయోగకరము కావచ్చును కదా! ఒకే రచయిత రెండు రచన (పద్యము-గద్యము) లిందు స్వీకరించుట సమీచీనముగా నగ

పడదు. ఒకరివే రెండు రచనలు స్వీకరించుటకు బదులు, మఱికొందఱి రచనలు గ్రహింపవచ్చును గదా!

ఇందలి పద్య రచనలు సాధించిన దానికంటె గద్యరచనలు సాధించినదే యెక్కువగాఁ గనిపించును. విద్యాధికారి, కవి సన్మానము, నను పద్యరచనలు మాత్ర మాకర్షకములుగా నున్నవి. శ్రీ వేటూరి వారి 'చిన్నిపూలు' కంఠ వృక్షమువలెను, దినచర్య (డైరీ) వలెను నున్నవి. ఆహ్వానము, తగినట్లుగా నగపడదు. కథలు–గాథలు ఒకటికావు గదా! [శాలివాహన కథలతో పేజీ 1]. నవముద్రాఖ్య నందనందన చరిత్ర పండితారాధ్య కృతులలో క్రీగీటు గీచిన పదము మరుత్తరాట్చరిత్ర చుట్టును భ్రమించుచున్నది. 'విబుధ స్త్రీ హాస సాంద్రీ సుధాస్వాతిథ్యంబుల' స్వాతిథ్యములో, స్వ ఆతిథ్యమా? సు ఆతిథ్యమా? పీఠ విచక్షణ. 2వ పేజీలో - ప్రత్యక్ష మహాసుల గొలుము' కొలువుము అనుటకు ఇది సాధ్యమేనా? అందులోనే–దిదృక్షన్ విడు; లేక నాటిరివిసిత్వాంతల్. శ్రీనాథుడు శృంగార రసప్రియుడు కావచ్చునేమో కాని శివ సన్నిధిలో పూజా సమయము వ్యక్తమయ్యెడి స్థితిలో మాత్రము దివిషత్కాంతా దిదృక్షారిరంసువు మాత్రము కాదు. అట్లనుకొన్నచో శ్రీనాథుని పునఃపరిశీలన యవసరమే.

ఆహ్వానములో చివరి పద్యములో 'ఎల్లను శిష్యులం గొని మునీంద్రుల మిత్రుల గూడి నీ వికన్ జల్లగ నైజయంతి శిరసావహియించుచు సాగిరమ్ము' విచిత్రతరమై యున్నది. "మా యిల్లు గొంత లేదు తమ కంత యిడన్ అరటాకు జూచినన్ బుల్లనఁ బోకులే యెడద సజ్జన సత్కృతి కడలే దయా!" శ్రీనాథుని సజ్జనునిగానా, సత్కవిగానా గౌరవించుట? ఈ భాగమును శ్రీనాథునకుఁ దగినట్లుగా లేక పేలవముగా నున్న దనవచ్చును. విద్యాధికారిలో (21వ పేజీ) గీత లాంధ్రి నతీ శిరస్స్వాతే రత్న! యిందు స్వాతె పద మింపుగా నగపడదు. శిరో రత్నమును లేక శిరోమణిని తలలో పూవునువలె తురుముకొందురో మరేదియో చేయుదురో? స్వాతత్వము (గ్రుచ్చుకొనుట) మాత్ర మంత యిదిగా లేదేమో? 'శ్రీనాథ ప్రశంస'; 'కవి సన్మానము, విద్యాధికారి' అనువానివలె లేదు. ఇందు వారు శ్రీనాథుని సంపూర్ణముగఁ జిత్రింప ప్రయత్నించిరి. మరియు 'హరవిలాసంబున మెఱుగువెట్టెను కాళిదాసంత కవికి గందర్ప కథను, ప్రస్తుతము శ్రీనాథ సంబంధమేయైనను నిట్లు చెప్పుట వలన శ్రీనాథునిపై నున్న మితిమీరిన యాదరమే గాక కాళిదాసుని కాంతిహీనత సూచితమగుచున్నది. ఇది విచారక్షమముగా నగపడదు.

శ్రీనాథ హృదయము–చాల పేలవముగా నగపడును. డిండిముని జయించుటే శ్రీనాథుని హృదయముగాఁ జిత్రించిరి. ఆ చిత్రణమును కవితా శ్రీనాథుడైన శ్రీనాథుని వ్యక్తిత్వమునకుఁ దగినట్లుగా లేదు. ఇందలి ప్రతి పద్యము సల్లై యున్నది. చివరకు శ్రీనాథుడు డిండిముని జయింపఁదలచి, పరీక్షకుఁబోవు నవ్యవస్థిత

చిత్తునివలె మాటిమాటికి గ్రంథముల నీక్షించె నట. ఇది చదివిన శ్రీనాథుఁడు మనవంటివాడేయని నిర్లక్ష్యము చేయఁదగియున్నాడు. బహుశః నింతకంటె నింతెగా నెవరును చిత్రించి యుండరు. ఇది యాంధ్ర సాహిత్య పరిషత్పత్రిక నుండి యిందు పునర్ముద్రితము. దీనికి బదులుగా నుత్కంఠను రేకెత్తించు 'శ్రీనాథుడు శ్రీరాముడు కాడు' వంటి దానిని మరొక దానిని ముద్రించిన బాగుండెడి దేమో ?

గద్య రచనలు పది :- (1) "చిన్నారి పొన్నారి చిఱుతకూకటినాడు" శ్రీనాథుని వ్యక్తిత్వమును యథాశక్తి చక్కఁగాఁ జిత్రింప యత్నించిరి. చిఱుత కూకటికి వీరు సాధించిన నిర్వచనము మనోహరమై వీరి పరిశీలనాశక్తిని వెల్లడించును. 'ఉదహరింప బడనిది' పేజీ 9. అని సాధువు కాదుగదా! 3వ పేజీలో 'రసమయ జగతికి రాకేందుమూర్తి'యిట రసమయ పయః పారావారమునకు రాకేందుమూర్తి యనిన మరింత బాగుండెడిదేమో? (2) నూనూగుమీసాల నూత్న యౌవనము మిక్కిలి హృదయంగమముగా నున్నది. 13వ పేజీలోని ప్రాకృత భాగములకు సంస్కృత చ్ఛాయ నిచ్చిన బాగుండెడిది. (3) నిండు జవ్వనము ఇందు శ్రీనాథుని రాజాశ్రయాదులను వివరించుట కన్న నాటి రాజుల వివరణము మితిమీరిన ట్లున్నది. విషయ వివరణము బాగున్నది. (4) ప్రౌఢ నిర్భరవయః పరిపాకము నిర్వహణము పేరునకుఁ దగినట్లుగా నగపడదు. దానితోపాటుగ నభివృద్ధి చెందిన శ్రీనాథుని కవితాప్రౌఢ బంధమును గూడ వివరించిన బాగుండెడిది దనిపించును. (5) క్షేత్రాలని ప్రాయములో శ్రీనాథుని కవితా సర్వస్వ ప్రౌఢిమయు మరింతగాఁ జిత్రితమైన బాగుండెడిది. (6) కవి సార్వభౌమత చాల చక్కఁగా మనోజ్ఞమై యున్నది. మరల మరల చదివించును. (7) శ్రీనాథుడు శ్రీరాముఁడు కాడు-మిక్కిలి గంభీరమై యున్నది. వివరణాత్మకమైనచో చాల బాగుండునే యను హతాభిలాషను కలిగించును. ఆనాటి విషయములను, ఆ కవి వాగ్వైఖరిని, ఉక్తిచాతురిని యీనాటివా రెరుగరు కదా! (8) ఉద్భట వివాద ప్రౌఢి : చాలబాగున్నది. పాఠకునకు నూత్న విషయ జ్ఞానము కలిగించుచున్నది. ఆలోచనాత్మకమై యున్నది. గంభీరముగా నున్నది. (9) దేశ సంచారము దేశ సంచారము వలెనే యున్నది. ఇందుండఁ దగనివా యనిపించు వానిలో నిదియొకటి. ఏదియో చేయబోయి శ్రీనాథు నేదియో చేసినారు. 'మహాదారంభము' 126వ పేజీ, భూతిరక్షము (129) వంటి విచిత్ర ప్రయోగములతోనున్న యీ వ్యాసము తృప్తికరముగా నగపడదు. (10) అరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి- శ్రీనాథుని చివరి దశను సజీవముగా నేత్రములకు సాక్షాత్కరింప జేసిరి. శ్రీనాథుని గూర్చిన నిందాక్షేపములకు సంయుక్తికములగు చక్కని సమాధానములతో సమన్వయ మిచ్చిరి. ఇది చాల సమగ్ర మనోహరమై యున్న దని చెప్పవచ్చును. శ్రీనాథుని సాక్షాత్కరింపజేసి రన్నట్లున్నది. ఇందు శూరాధ్యాపకుడై (131 పే.) అని శ్రీనాథునకు విశేషణము. శ్రీనాథుని శూరత్వ విశిష్టాధ్యాపకత్వము విచార

ణీయము-అర్థము స్పష్టమగుటలేదు.) దుర్నిరీక్ష్య తేజశ్శాలియై (133 పే) వంటి ప్రయోగములు విచిత్రములై యున్నవి.

ఇందచ్చు తప్పులున్నవి. (2వ పేజీ వీవీక్షించిన 21 పే. వాక్స్రుష్టం, 23 పే. సౌష్ఠవంబు మున్నగునవి.)

పద్య రచనలారు. 1. ఆహ్వానము (రచన: శ్రీ ద్విభాష్యం వేంకటరావు గారు) 2. విద్యాధికారి శ్రీ మధునా పంతులవారు) 3. కవి సన్మానము (శ్రీ ఇంద్రగంటి వారు) 4 శ్రీనాథ ప్రశంస (శ్రీ వెంపరాలవారు) 5. శ్రీనాథ హ్యాదయము (శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రిగారు) 6. చిన్నిపూలు (శ్రీ వేటూరివారు) గద్య రచనలు పది: 1. చిన్నారి పొన్నారి చిఱుత కూకటి నాడు (డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి గారు) 2. నూనుగు మీసాల నూత్న యౌవనము (శ్రీ ఇంద్రగంటి వారు) 3. నిండు జవ్వనము (శ్రీ దివాకర్లవారు) 4. ప్రౌఢ నిర్భరవయః పరిపాకము (శ్రీ చింతకూరి పాపయ్యశాస్త్రిగారు) 5. క్షేత్రాలనిర్ణాయము (శ్రీ పోడిరాజు శేషగిరిరావుగారు) 6. కవి సార్వభౌమత (శ్రీ మధునా పంతులవారు) 7. శ్రీనాథుడు శ్రీరాముడు కాడు (శ్రీ చెళ్ళపిళ్ళవారు) 8. ఉద్భట వివాద ప్రౌఢి (శ్రీ నోరివారు) 9. దేశ సంచారము (శ్రీ కర్రా చంద్రశేఖరశాస్త్రిగారు) 10. అనుగుచున్నాడు శ్రీనాథుడు (శ్రీ వెంపరాలవారు).

ఈ యాలోచన, దీని నిర్వహణ చాల బాగున్నవి. పద్యముల భాగము తగ్గించి యా భాగమును మరిన్ని గద్యరచనలతో నింపిన చాల బాగుండెడిది. ఏమైనను నీట్టి ప్రయత్నము శ్లాఘనీయమే. కాని యిక ముందయినను నీ కార్యమును మరింత గమనీయముగ గంభీరముగ నిర్వహించి పాఠకుల నానందింప జేయగలరని భావింతును. ఈగ్రంథము తప్పక చదువదగినది. శ్రీనాథుని సాక్షాత్కారమునగముపైగా నగును. శ్రీనాథుని పరిశీలన సామాన్యము, సర్వజన సులభము, కాదు. కాని వాని యాకర్షణ శక్తి మహత్తరము. అట్టి శ్రీనాథుని ఘనతను వివరించుటకు శ్రీ మధునాపంతుల, ఇంద్రగంటి, వెంపరాల, నోరి వంటి వారినింకను గొంతమందిని గూర్చి నిర్వహింపజేసిన నిది సార్థకమగును. అట్టివారు దుర్లభులు, దురీక్షులు, దుష్ప్రాపులు గారు. సమస్త రాగాభిమానములు విడిచి సహృదయైక పక్షపాతులై వెదకినచో వారు నిర్వ్యాజముగ మహానందముతో కొన్ని తరముల వరకు సరిపోవు విషయమును (పరిశోధనా ప్రమాణమును బట్టి యైనచో ఎంతోమంది పి. హెచ్ డి., లు తయారగునట్లు) వివరింపగలరు. శ్రీనాథుడు ప్రాచీనుల నుండి గైకొనిన శబ్దార్థ ప్రకటన, రచనా విధానము, ఆతని స్వతంత్రత, వానినుండి తరువాత వారు గ్రహించిన విషయములు, వాని వివరణ, మున్నగు విభాగము లేర్పాటు చేయువచ్చును.

—0—

అనువాద దాస్య పరంపరాభివృద్ధి!

# ద్విపదగీత - సమాలోచన

(ఒక దృక్పథము) -- శ్రీ సోమసుందర్

ఒకడు దుర్భరపాపానికి గురైతే తప్ప- ఒక అనాస్వాద్యగ్రంథాన్ని చదవవలసిన దుస్థితి కలగదు. అలాంటి దుస్థితి కలిగించిన గ్రంథాలలో 'ద్విపదగీత' అనేగ్రంథ మొకటి. దాని గ్రంథకర్త శ్రీతెంగుడిగ శ్రీ ధర్మారావు బి. ఓ. ఎల్. అనేవారు. నిజామాబాద్ నిర్మలహృదయ కాన్వెంటు హైస్కూలు ఉపాధ్యాయుడు. 1/8 D.F C. లో మొత్తం 78 పుటలున్న ఈగ్రంథం వెల మూడు రూపాయలు మాత్రమే. పదిహేనుపుటల పరిచయాలూ, యోగ్యతాపత్రాలూ ఉన్నాయి. ఈ దేశంలో ఎవ డేపనిచేసినా ప్రస్తుతించే బృందారకులు సిద్ధంగా ఉంటారు కనుక, వాటి చాట్లే పట్టించుకోనక్కరలేదు! మిగిలినగ్రంథం - పంక్తికి రెండు ద్విపదపాదాలుగా ముద్రించిన భగవద్గీతానువాదం.

మళ్ళీ రామాయణమే ఎందుకు రాస్తున్నావంటే-నువ్వు తిన్న అన్నమే తింటూండడంలేదా ? అని ఒకబుద్ధిమంతుడు ఎదురుసవాలుచేశాడు. గొప్ప తెలివి ప్రదర్శించాననుకొని మురిసిపోయాడు! శుద్ధ అన్నంతినడం, చేయికడుక్కోవడం, దాంపత్యం నెరపడంవంటి సాధారణ విషయమే అయితే, ఒకడు కష్టపడి కావ్యనిర్మాణం చేయనక్కరలేదు. అంతటి సామాన్యదైనందిన వ్యవహారమే మళ్ళీ మళ్ళీ రామాయణాదుల్ని అనువాదం చేయడమూ అయితే- అపని మానేస్తేనే జాతికిమేలు ! భోజనాదులు మనిషి ఆరోగ్యంగా బ్రతకడానికి అత్యవసరాలు. ఈ రెండోపని టన్నులకొద్దీ స్వేచ్ఛమైన తెల్లకాగితానికి కీడు ! చిత్రం- ఎవ డేం చేసినా వాడి ముచ్చట తీర్చే చెక్కభజనబృందాలు దేశంనిండా పుష్కలంగా ఉన్నాయి. అలాంటి అలుసు కనిపెట్టిన బుద్ధిమంతు డెందుకు మానేస్తాడు ?

“అయ్యా, నీగ్రంథంలో అల్పాతిఅల్పమైన అనౌచిత్యాలున్నాయయ్యా! అని ఎవరైనా తర్జని నిగిడిస్తే- వెంటనే ఆ బుద్ధిమంతుడూ అతని జోహుకుందారులూ విరుచుకు పడతారు. “నువ్వు బ్రాహ్మణవ్యతిరేకివి ! నువ్వునాస్తికుడివి ! మహాపాపివి! “అంటూ శాపాలు కురిపిస్తారు. ఉత్తమాపులకే నేలపడే అడవికొక్కిరాయులవంటివి లేవు గనుక గాని లేకపోతే ఈశాపాల కెందరు నేలపాలయ్యేవారో ! బుకాయింపు చేతనైతే- ఏంచేసినా చెల్లినట్లే కనిపిస్తుంది.

ఇక ఈగ్రంథకర్త- గ్రంథరచనకీ కవిత్వానికీ బొత్తిగా కొత్తవాడని ప్రతి పంక్తీ సాక్ష్యమిస్తూనే వుంది. ఐనా ఆమాట యోగ్యతాపత్రాలిచ్చినవా రెవరూ

అనలేదు. ఉపోద్ఘాతం రాయమంటే రాసియిచ్చిన శ్రీ దోర్బల విశ్వనాథశర్మ సామాన్యులేం కాదు. సాహిత్య విద్యాప్రవీణ, సంస్కృతాంధ్రాలలో ఎమ్. ఏ. పట్టభద్రుడు! ఈ అనువాదం శ్లోకానికి రెండేసి ద్విపదలుగా సాగడంవల్ల "సప్తశతీద్వయ గౌరవమును బ్రహ్మాండముగా సంతరించుకొన్నది" అంటూ స్తుతించారు. "శ్రీధరరావు వామనుడైనను పరిహాసము కలుగ"దట. శక్తికొలది అనోపమముగా, సగుణముగా అనువాదము చేయగోరిన శ్రీధరరావు సంకల్పము' ఫలించినదని యోగ్యతాపత్రమందించారు.

సగుణ మెట్లోవారు వివరించలేదు. ఈద్విపదరచనలోని సొగసులను విశదం చేయలేదు. ఇందలి 'ధారాశుద్ధి'ని స్పర్శించలేదు. కనుక శ్రీ దోర్బలవారి ప్రస్తుతి చాలా దుర్బలంగా ఉన్నదనవలసి రావడమే చింత్యము.

"మహాభారతమును కావ్యముగా సంతరించిన తిక్కన దీనిని (భగవద్గీతను) యథాతథముగా అనువదింపకపోవుటలో ఔచిత్యమే యుండుగాక!" అన్నారు శ్రీ దోర్బలవారు. భగవద్గీత వ్యాసకృతమే కాదనీ, అది ప్రక్షిప్త మనీ, నైరాశ్యం పొందిన అర్జునునకు కర్తవ్యప్రబోధంచేసి శ్రీకృష్ణుడు సమరోత్సుకునిగా చేశాడన్న సందర్భాన్ని పురస్కరించుకొని - బుద్ధయుగం తర్వాత ఎవరో ఈ భగవద్గీతను రచించి మహాభారతంలో చేర్చిఉంటారనీ, పరిశోధకు లంటున్నారు. అట్టిసందర్భంలో తిక్కనగారికి లభించిన తాళపత్రగ్రంథం- భగవద్గీతావిరహితంగా ఉన్నదే కావడం లోనూ అసంగత ముండదుకదా!

శ్రీదోర్బలవారేకాక ఈగ్రంథానికి సర్వశ్రీ వానమామలై వరదాచార్యులు, కేశవపంతుల నరసింహశాస్త్రి, ప్రభృతు లెందరో మెచుకోళ్ళిచ్చారు. అందరూ భగవద్గీతామాహాత్మ్యం స్పర్శించి పుణ్యం కట్టుకున్నవారే!

అనువాదంకాని, స్వీయరచనకాని, కవితారచనకు ప్రాథమికావసరాలు- ధారాశుద్ధి, అక్షరరమ్యతయు, ఈగుణాలుఅబ్బితే ఒకగ్రంథం తనంతతానుగా ఉత్కంఠతో చదివించగలుగుతుంది. రమణీయ కల్పనాచమత్కృతి లోపించినా సర్దుకుపోయే ఔదార్యాని పాఠకునిలో కలిగిస్తుంది. ఈప్రాథమిక లక్షణాలు మృగ్యమైనా రచన ఏదైనా, అదెంత పవిత్రమైనదని డబాయించినా- తెలుగుబైబిలు అనువాదంలాగే అపభ్రంశంపాలుగాక తప్పదు.

అర్జున విషాదయోగంలో పదవశ్లోకార్థం ఎలా ద్విపదీకృతమైందో ఈక్రింది పాదాలలో పరిశీలించవచ్చు.

"అట్టినాబల మపర్యాప్తంబు నగుచు
రాజిల్లు భీష్మాభిరక్షణం బగుచు
కనగ భీమాభిరక్షణమునందున్న
సైన్యంబు పర్యాప్త సంఖ్యలో గలదు
వ్యూహాముఖమ్ములం దుత్సాహు లగుచు..."

ఈ అనువాద సరళికన్న మూలం ఎంతో సారళ్యంతో ఓజస్వంతంగా ఉంటుం దనడంలో – భగవద్గీత మూలంతో పరిచయ మున్నవా రెవరూ తమ అసమ్మతి తెల్పరు! సాంఖ్యయోగానువాదం కొంత మెరుగేఅయినా, వాక్యం వెంట అర్థమూ, అర్థం వెంట భావమూ చదువరి మనసులో రేకులు విప్పుకుంటూ సాగకపోతే అది ద్విపద అయితే నేం – చపల అయితే నేం? పఠితలో ఆనందోత్సాహాలూ, హార్దిక సంతుష్టి కలిగించని యిలాంటిరచన వ్యక్తగత పుణ్యసముపార్జనకోస మనుకుంటే – రామకోటి రాసు కుంటూ కాలక్షేపం చేయడం మేలుకదా!

కర్మయోగాది – ఇతరప్రకరణా లన్నింటా అపరిపక్వవాక్యనిర్మాణమూ, ధారా శుద్ధి విరహిత పాదపూరణ గణానారత్వమూ – బహుళంగా కనిపిస్తాయే తప్ప – రస పారవశ్యం ఎక్కడా దర్శన మీయదు. కావాలనుకుంటే ఈ ఒక్క ఉదాహర ణనూ పరిశీలించండి చాలు.

"కుదురు స్వాభావిక గుణములకలన
ముహ్యులై కర్మంబు పూనిగ జేయు నరుడు
కాని యతం డహంకార భావమున
కర్మలన్నిటికి దా కర్తగా నెంచు
గుణకర్మ భేదముల్ గుర్తించి, గుణుల
యందు గుణావళి యంటి వర్తించు
ననితలపోసి మహాబాహు యతడ
నాసక్తుడైయుండు నం చెర్గు మీవు !"

అరసున్నలూ, సరళాదేశాలూ, ఈగ్రంథమంతా పుష్కలంగా ఉన్నా రచ నలో మాత్రం ఎక్కడా సారళ్యము చోరబారకుండా సకల – జాగ్రత్తలూ తీసుకో బడ్డాయి. కనుక ఐహిక సంబంధ ఆకర్షణలకు లోనుగాకుండా ఈ ద్విపదగీత పావిత్ర్యం సంరక్షితమైంది కనక – గ్రంథకర్తకు అంతమునందు మోక్షప్రాప్తి లభించు గాకయని ఆకాంక్షించడం అసంగతం కానేరదు.

-*-*-

# శ్రీధరీయ ద్విపదగీత

( మరొక దృక్పథము )

— శ్రీ హంస.

ఇన్నాళ్లకు మంచి గీతానువాద మొకటి చదువ నవకాశము లభించినది. పుస్తక మందినది పగలు పన్రెండు గంటలకు. వెంటనే చదువ నారంభింపగా విడువ బుద్ధిపుట్టక అట్లే చదివి చదివి మూడు గంటలకు ముగించితిని. ఇట్లు చదివింప గల శక్తి ఈ యనువాదమం దున్నది.

అనువాదకులు శ్రీ తంగుడిగె శ్రీధరరావు గారొనర్చిన గీతాజ్ఞాన యజ్ఞ ఫల మిది. ఇంత సుప్రసన్నముగా మూలభావముల నందించుచున్న తెలుగు గీత నేను చూచిన దిదియే యనుకొందును. గీతను పద్య గద్యములలో నెందరెందరో యనువ దించి యున్నారు. నాకు తెలిసిన ద్విపద గీత యిది యొక్కటియే. అనుష్టుప్పుల ననువదించుట కీ ద్విపద కొలిచినట్లు సరిపోయినది. తక్కిన తొడుగులు వదులగుటయో బిగు తగుటయో జరిగి మూలభావము వ్యాకోచ సంకోచముల నందుట తప్పనిసరి యైనది.

నేడు గీతను పరమార్థమునకై కాక స్వప్రయోజనములకై యుపయోగించు కొను వారే అధిక సంఖ్యాకులు. వారు భగవద్వాణికి తమ కిష్టము వచ్చిన యర్థ ములు చెప్పి తమ చేతలను సమర్థించుకొందురు. పరమార్థము నభిలషించు వారు సం ప్రదాయార్థమునే శిరసావహింతురు. శ్రీధరరావుగారు శ్రీధరీయ వ్యాఖ్యతో గీతా ధ్యయన మొనర్చి మూలగ్రంథ పరివర్తనాసహిష్ణుత్వమును గుర్తించిన వారయ్యును స్వీయజ్ఞాన దార్ఢ్యమునకై యొక సంవత్సరము పాటు శ్రద్ధాభక్తులతో నొనర్చిన కృషి లోకమున కొక వరప్రసాదమైనది.

మూల భావములను మున్నూర్తుల నట్లే యందింపఁ గలుగుచుండుట, ఎట్టి క్లిష్ట భావమునైనను సుప్రసన్నముగా నందించుట, ముఖ్యపదములను పరివర్తింపక వాని నట్లేయుంచి తెలుఁగు నుడికారము చెడకుండ రచన సాగించుట ఈ యనువాద వైశి ష్ట్యమునకు ముఖ్య హేతువులు. వీని నిరూపణమునకు గ్రంథ మంతయు నుదాహరింపఁ దగినదియే. అయినను మచ్చున కీ క్రింది ద్విపదలు గమనింపుడు.

మూలభావమును పట్టి యిచ్చుటకు

గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష మపీహ లోకే
హత్వార్థ కామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిర ప్రదిగ్ధాన్ ॥

మహనీయ గురువులన్ మడియింపకుండ
తిరిపంపు కూడైన తిను టెంతో మేలు
అర్థ కాముకులైన యవ్వారిఁ గూల్చి
నెత్తుటి సుఖములన్ నేనెట్లు కుడుతు? ॥

క్లిష్ట భావ సుప్రసన్నతకు—

న త్వే వాహం జాతు నాసం
నత్వం నే మే జనాధిపాః
న చైవ న భవిష్యామః
సర్వే వయ మతః పరమ్ ॥

ఉర్వి నే వెనుక లేకున్నది లేదు
అట్లె నీవును నీ జనాధిపు లంతే
ఎంచ నీ భూపతు లెల్లరున్ మనము
నుండఁ బోకుండుటయున్ లేదు సుమ్ము!

విశిష్టార్థ వంతములైన పదములను పరివర్తింపక
తెలుఁగు నుడికారమును నిర్వహించుటకు—

వేదాఽవినాశినం నిత్యం
య ఏన మజ మవ్యయం
కథం స పురుషః పార్థ
కం ఘాతయతి హంతి కమ్ ॥

ఆత్మ నిత్య మ్మని యవినాశి యనియు
నవ్యయ మైనట్టి దనుచును మఱియు
నజ మని తెలియు వాఁ డవని నెందేని
నెవనినిఁ జంపించు నెవనినిఁ జంపు ?

ఉపోద్ఘాత వక్తలు శ్రీ దోర్బల వారన్నట్లు దీని ప్రాశస్త్యమును గుర్తించి మోకరిల్లకుండుట అహంభావమునకో బ్రాహ్మ్య భావమునకో నిదర్శనము కాగలదు.

ఉత్తమ రచన ముత్తమముగా ముద్రితము కాకపోవుట మనజాతి దురదృష్టము. నా చేతికి వచ్చిన ప్రతిలో రచయితయే కాబోలు స్వయముగా నెన్నియో స్ఖాలిత్యములు దిద్దియున్నారు. వారు వదలినవి కొన్నొల్లలు. త్వరలో నిది ద్వితీయ ముద్రణ భాగ్యమందు ననియు నప్పుడైన నిర్దుష్టముగా కంటికి మనసునకు నాహ్లాద కరముగా ముద్రితమగు ననియు నాశింతము.

సలక్షణ గ్రాంథికాంధ్రమున నున్నతే ప్రమాణము నందున్న ఈ పుస్తకములో నూరి స్పష్టముగా నిరసించిన 'చేతు' ప్రయోగము పరిహరింపవచ్చును. ఆయన మత

( తరువాయి 22 పేజీలో )

# గాలిరథం

[ కథాసంపుటి : 172 పుటలు - వెల 10 రు. రచయిత్రి: శ్రీమతి ఆర్. వసుంధరాదేవి. ప్రతులకు : విశ్వప్రభ పబ్లిషింగ్ హౌస్, నేండ్రగుంట, చిత్తూరు (జిల్లా) ]

గాలిరథం అనే యీ కథా సంపుటంలో–పెంజీకటి కవ్వల, బ్రిడ్జిక్రింద, పండుగ, తోలుబొమ్మలు, చెరువు దగ్గర, పిచ్చిగీతలు, గాలిరథం, ఇంతేలే పేదల ఆశలు, బదిలీ; అనే తొమ్మిది కథలున్నాయి. ఇవి అప్పుడప్పుడు భారతి, ఆంధ్ర పత్రిక ఉగాది ప్రత్యేక సంచికల్లో ప్రచురింపబడ్డట్లు రచయిత్రి తెల్పిన 'కృతజ్ఞత'లో వ్యక్తం అవుతున్నది. ముందుమాటగా శ్రీ మధురాంతకం రాజారాంగారు చేసిన పరిచయం ముత్యంలా ఉంది.

'గాలిరథం' అనే ఒక కథానికా శీర్షికయే గ్రంథనామంగా కూర్చారు రచయిత్రి.

అన్ని కథల కంటె 'పెంజీకటి కవ్వల' అన్న కథ పెద్దది. జయలక్ష్మి డా॥ సీతారామారావుగారి భార్య. ఆమె అర్థం కాని మానసిక–అసంతృప్తితో జీవిస్తూ ఉంటుంది. చావు అంటే చచ్చేభయం. డా॥ సీతారామారావు చాలా విషయములు తేలిగ్గా తీసుకుని దాటుకు పోయేవ్యక్తి. వాళ్ళకు ఇద్దరు ఆడపిల్లలు. రాధిక బీ.యస్సీ. చదువుతున్న సౌభాగ్యరాలు. రెండవ పిల్ల చంద్రిక 'పిచ్చివాలకం' పల్ల. మెదడు సరిగ్గా ఎదగకుండ పుట్టింది. ఇల్లాటి బిడ్డ పుట్టడంతో జయలక్ష్మి మనస్సు పిచ్చి పిచ్చి ఆలోచనలతో మరిగిపోతూ ఉంటుంది. ఏ చావు విన్నా, ఆమిత్తి తన మీదకే వచ్చి పడినట్లుగా బెదిరిపోతూ ఉంటుంది. ఆమె దృష్టిలో

"అనుభవం, ఆనందం–ఇవి అబద్ధాలు.
ఒంటరితనం, చావు, దుఃఖం .ఇవే నిజాలు.
అవాంఛనీయాలు, అనుకోని ప్రమాదాలు, పిచ్చివాని చేతిలోని
రాళ్ళలాగా వచ్చి మీద పడుతున్నాయి."

ఓ సారి పెద్దకూతురు రాధిక అంటుంది, "ఎక్కడకు వెళ్ళినా దుఃఖించడానికి ఒక కారణం కనబడుతుంది అమ్మకి." ఈ వాక్యం బిడ్డ, తల్లి తత్త్వాన్ని కాచి వడగట్టి చెప్పిన సూత్రంలా ఉంది.

ఇంటి వెనకాల ఉన్న శ్మశానం, చెడ్డీలో తేలుదూరి కుట్టి చచ్చిపోయిన పొరుగింటి పాప పద్మ కథ, బెంగుళూరు కేన్సర్ ఆసుపత్రిలో కన్నుమూసిన వెంకటప్ప జీవిత చరిత్ర–అన్నీ ఆమె మనస్తత్వ మహాపురాణంలోని ఉపాఖ్యానాలు. వీటిలో ఏ చరిత్ర కాచరిత్ర ఒక స్వయం సంపూర్ణమైన కథానిక.

ఈ విధమైన మనఃస్థితితో సతమత మవుతున్న జయలక్ష్మి యింటిముందుకు తో సాయంతన వేళ బొమ్మలచక్కాని చూపించే అబ్బి వచ్చాడు. చంటిపిల్ల చంద్రి

కతోపాటు జయలక్ష్మి కూడ ఆ చోద్యం చూస్తూ ఉంటుంది. ఢిల్లీ పట్టణం, ఇందార్ని గాంధీ దర్బారు, గోవా సముద్రం, అవీ...ఇవీ అన్నివింతలూ చూపిస్తున్నా డా పురుషుడు.

చివరికి ఆనంద తన్మయాత్వంలో_తిరిగి ఏ చీకూ చింతా లేని స్థానంలో జయలక్ష్మి ఉండిపోయినట్లు రచయిత్రి చెపుతారు. అంటే ఆమె పెంజీకటి కవ్వలకు దాటే సింపన్న మాట. బ్రతికి ఉన్నంతకాలం అనుభవించిన భయాందోళనల సమాహార రూపమే 'పెంజీకటి'.

ఆ వచ్చిన చుక్కాని చూపించిన అబ్బి నిష్క్రమణాను, రచయిత్రి "తన ప్రపంచాన్ని బుజాన వేసుకుని వెళ్ళిపోయాడు." అంటూ సూచించారు. ఆ పురు షు డెవ్వడో కాదు. కాలపురుషుడు, ఇది ధ్వని.

కథ యావత్తూ కేవల మన స్తత్వ చిత్రణమీద ఆధారపడి ఉంది.

'పండుగ' అనే కథ ఉగాది పండుగ దినంతో ఆరంభమవుతుంది. భర్తకు పండక్కి కొత్తబట్టలు వేసుకోవా లన్న తాపత్రయం లేదు; తను అందరితోపాటు పండుగ చేసుకుంటున్నట్టు నటించడమే గాని భార్యకీ పెద్ద ఉత్సాహం లేదు. మగ బిడ్డడున్నాడు, వాడికి ఆలస్యంగా నిద్ర లేవడమే పండుగ. ఇల్లా ఉన్న కుటుంబం ఓసారి జమీందారీ ఛాయాలో లెక్కింపబడే బంధువుల యింటికి వెళ్తారు. అక్కడ అన్ని విధాలా సౌకర్యంగా ఉన్న వసతీ వగైరా ఉన్నాయి గానీ, యింటి నిండా అనారోగ్యాలు. చివరికా గృహిణి, తను భర్తా బిడ్డలతో కలిసి ఉండే ప్రతిక్షణం 'పండుగే' అనే నిర్ణయానికి వస్తుంది. సుఖమయమైన తన సంసారయాత్ర కంటె మించిన పండుగ మరొకటి లేదు; అని యీ చిన్న కథ సూచిస్తున్నది.

మరో గృహిణి, బ్యాంకు ఆఫీసరుగారి భార్య. ఎప్పుడూ వెళ్ళివస్తూ ఉండే గుడికే ఓనాడు భర్తతో సహా వెళ్తుంది. భర్తపై కసి ఉన్నవాళ్లు ఎవరో చీకటిపడ్డ ఆ వేళలో వచ్చి, భర్త నుండి ఆమెను బలవంతంగా దూరంచేసి చేయరాని అవమా నమే చేశారు.

భర్త మరోలా ప్రవర్తించడం మొదలు పెట్టాడు. ఆ బాధతో ఆమె ప్రాణాలు కోల్పోతుంది. ఇదీ 'చెరువు దగ్గర' అనే కథ.

పై రెండు కథల్లోను కథాభాగం అంత విశేషంగా లేకపోయినా ప్రకృతివర్ణన, మనశ్చిత్రణ స్పష్టంగా సున్నితంగా ఉన్నాయి.

గాలిరథం, బదిలీ అన్న కథానికలు ఈసంపుటిలో చెప్పుకోదగ్గ మరో రెండు కథలు.

గాలిరథం_ మహాన్మదీయ విశ్వాసాన్ని, కష్టజీవుల జీవితవాతావరణాన్ని నిరూపిస్తున్న కథ. అనారోగ్యంతో గత్యంతరంలేక తమ్ముని ఇంటికిచేరి, మరదలితో

కుదరక వేరేవండుకుంటూ, చివరకు, అస్తమించిన అభాగ్యమహమ్మదీయ వనితజీవితం, ఆమె బిడ్డలస్థితి, యిందులో వర్ణింపబడ్డాయి. దేవుడు గాలిరథం మీద ఎక్కి తిరుగుతూ ఉంటాడని వారినమ్మకం. కొంచెం గాలి బల్లగా వీస్తే- అదిగో దేవుడు తిరుగుతున్నాడు- అనుకుంటూ ఉంటాడు, ఆ చచ్చిపోయిన తల్లి కన్న చిన్నకొడుకు. తల్లి శవాన్ని జట్కాలో శ్మశానానికి తీసుకుపోతూంటే పెద్ద గాలివీచి దుమ్ము లేచింది. అమ్మను దేవుడు తీసుకుపోతున్నాడని అనుకుంటాడు. వాడి మనస్సులో రేగిన తుపానుకు ఆ గాలిదుమారం బహిః ప్రతీక.

ఆఊరు "బదిలీ" అయిన పట్నుండి, తనకూ చిన్నకొడుకు ఆనంద్‌కు తప్ప ఇంటిల్లిపాదికీ అస్వస్థతలూ అనారోగ్యాలూ. వాళ్ళు అద్దెకుంటున్న యింట్లో దయ్యం తిరుగుతూ ఉంటుందని వాడుక. వాళ్ళ అనారోగ్యాలు ఆ వాడుకకు నిదర్శనంగా కన్పిస్తూ ఉన్నాయి. ఆగృహిణి, భర్త బదిలీ చేయించుకోవాలని ఎంతో ఆత్రపడుతూ ఉంటుంది. ఆకథలో రచయిత్రి ఆ గ్రామానికి 'చింతలూరు' అని నామకరణం చేయడం ఒక ఉపజ్ఞ. ఆఊరు వచ్చినప్పటి నుండి ఆగృహస్థులకు ఉన్నచింతలే. చివరికి వారికి బదిలీ లేదుగాని, ఆరోగ్యంగా దుడ్డుగా ఉంటున్నట్లు కన్పిస్తున్న ఆ చిన్నకొడుకు 'ఆనంద్' ఇంటివెనుక ఉన్న చెరువులో పడి చనిపోతాడు.

ఈ కథఅంతా విశ్వాసం మీద ఆధారపడి నడిచింది. అందుచేతనే 'రీజనింగ్‌కు' అందీ అందని అధ్వాన్నపు విశ్వాసం. 'హేతువు చెప్పలేం కాని అది అల్లా జరిగింది'- అని సమాధానపడవలసిన యితివృత్త చమత్కారం ఈకథలో ఉన్నది.

ప్రతికథనూ ఇక్కడ ఉటంకించడం ఇక్కడ కష్టసాధ్యం. అన్ని కథలనూ గాఢావలోకన చేస్తే ఈ రచయిత్రి రచనాతత్త్వం ఇది.

వీరి మనోనయనాలకు కథాప్రపంచం, పాత్రలు, సుస్పష్టంగా కన్పిస్తాయి. ఆ దర్శించిన సన్నివేశాలను చక్కగా సరళంగా వ్యక్తంచేసే పదగ్రథన కౌశలం వీరిలో దైవానుగ్రహంవల్ల పరిపక్వస్థితిలో ఉన్నది. టీ బడ్డీలదగ్గర, బస్సుస్టాండుల దగ్గర, తిరుగులాడే అనాథబాలుర చేష్టా మనః ప్రవృత్తులను వీరు ఇంతసన్నిహితంగా ఎల్లా పరిశీలించారా అని ఆశ్చర్యం వేస్తుంది.

వీరి స్త్రీపాత్రలు- సామాన్యంగా మధ్యతరగతికి చెందిన గృహిణులు. చక్కగా పెద్దలు కుదిర్చిన పెళ్ళి చేసుకుని సంతానం కంటూ భర్తలతోపాటు అన్ని విధాలైన కష్టసుఖాలూ పంచుకోగల్గిన సాధుజీవనలు. క్షమామూర్తులు. 'మృత్యుభయం' అన్ని స్త్రీ పాత్రలలో అంతో ఇంతో కన్పిస్తూనే ఉంటుంది. యౌవనంలో ఉండి అర్థంలేని ఆవేశాలతో ఉరకలు వేసే పాత్రలను వీరు సృష్టించరు. ప్రస్తుత కాలంలో ఉన్న చాలమంది రచయిత్రులవలె, పురుషులకంటె నాలుగు ముక్కలు ఎక్కువగా శృంగారరస పరిప్లుతంగా రచనచేసి గిలిగింతలు పెట్టాలనే కుయత్నం జోలికి వీరికలం వెళ్ళదు.

పన్ని వేశాల్లో సహజత, వ్యక్తీకరణలో కవిత కన్పిస్తూఉంటాయి.

"ఆకాశం మురికిరంగు ఫులుముకొని వానమబ్బులో మూసుకుపోయి ఉంటు న్నది." ఇప్పుడు పండుగలనేవి అర్థం పర్థంలేని ఆచారాలు, పాతకాలపు అలవాట్ల తాలూకు శవాలు." "కేన్సర్ హాస్పిటల్... అత్యాధునికంగా శుభ్రంగా ఉంది. అందమైన ఆరోగ్యకరమైన జీవితానికి పెట్టనికోటలాగా ఉందిగానీ మృత్యుదేవత కంచుకోట అనుకోవడానికి ఏమాత్రం వీలులేదు." వంటి 'కైతముక్కలు' హృదయా నికి ఆహ్లాదాన్ని కల్గిస్తూఉంటాయి.

గుణం పుష్కలంగా ఉన్న ఈరచనలో దోషాన్వేషణచేయడం అనవసరం.

ఇంత మంచికథలూ, ఇంతకంటె మంచికథలూ, వీరిలేఖిని నుండి ఆంధ్రకథా పఠితలు ఇతోధికంగా ఆశించవచ్చు.

— 'సుగుణారాధక'

---

( 18 వ పేజీ తరువాయి )

మున యువర్ణంబు తోడి దుగ్ధకారము తకారము కారాదుగదా! సంస్కృత సమాసము లలో రేఫ సంయుక్తమునకు ముందున్న యక్షరము గురువగుటయు కాకపోవుటయు కవి వివక్షాధీన మయియే యున్నది. ఈ యవకాశమును పురస్కరించుకొని వీరెచ్చ టను గురువు చేయకుండ నుండలేదు. కాని ప్రథమ శ్లోకానువాద మందే అట్టి దొకటి తటస్థించినది. 'మఱియు పాండవు లసమాన ప్రౌఢిమను'—ప్రౌఢిమను మార్చినచో గ్రంథ ప్రౌఢిమ పెరుగఁ గలదు. అబ్జము శంఖార్థమున ప్రయుక్తమైనది. ఇది ప్రసన్నతకు దోహదకారి కాదు. 'స్వోదరార్థంబున వండెడు నట్టి' ఈ పాదమున స్వశబ్ద వకారము నందలి అకారమునకు ప్రాముఖ్య మిచ్చి యతిపాటించుట సమర్థ నీయ మనిపించుట లేదు. 'తమ్ముఁడా మెచ్చి పెద్దల దూఱువారు' అనుచో 'తముఁ డామె మెచ్చి' యన్నచో మఱింత బాగుగ నుండఁగలదు. 'చిత్తమునఁ దల్చి' అన్నచో ఆత్వలోప మొనర్చుట యెబ్బెట్టుగా నున్నది. ఇట్టివి మాత్రమే కనిపించు టచే వీనిని పేర్కొనవలసి వచ్చినది.

ఈ గ్రంథమును ప్రశంసించుచు వీరి మిత్రులు కవి గణపతిగారు.

శ్రీధర ప్రోక్తమై సిద్ధించె గీత
శ్రీధర వ్యాఖ్యచేఁ జెల్వారె గీత
శ్రీధర ద్విపదల చేత నేటికిని
శ్రీధరీయంబుగాఁ జెలఁగె నా గీత ॥

అన్నమాట ముమ్మాటికి నిజము. వీరు రచించిన ఆరు ద్విపదలు చదివిన వారికి ఈ శ్రీధరీయముగూడ మంజరీ ద్విపద గాక యిట్లున్నచో నెంత మనోహరముగా నుండునో గదా యనిపించును. *

# నవల విమర్శ - ఒక పరిశీలన

[సంసార వృక్షముపై విమర్శ చూచిన తరువాత]

ఈ పరిశీలనని రెండు భాగాలుగ విభజింపవచ్చు. ఒకటి సంసార వృక్షముపై శ్రీ సోమసుందర్ గారి విమర్శనా పరిశీలన. రెండు సంసార వృక్షము, దాని రచనా విశిష్టత. ఇవి రెండూ ఒకదాని కొకటి సంబంధించినవే అయినా ప్రస్తుతం శ్రీ సోమ సుందర్ గారి విమర్శనా పరిశీలనయే ముఖ్యంగా ఉద్దిష్టము.

శ్రీ సోమసుందర్ గారు 'నవల'ని గురించి ప్రాచ్యులుకాని వారి అంటే పాశ్చాత్యుల నిర్దేశాన్ని ఉటంకిస్తూ ఆరంభం చేశారు. నవల అనేది సాహిత్య ప్రక్రియలలో ఒక రకం. అది కేవలం పాశ్చాత్యోపజ్ఞము మాత్రం కాదు. గులాబీకి అంట్లు కట్టి ఆధారమైన ఆ గులాబీ మొక్క నుండి రకరకాల గులాబీపూలని పూయించడం అనేది మాత్రం ప్రాచ్యభిన్నమైన ఉపజ్ఞలాంటిదికావచ్చు. కానిమూలమైన గులాబీ మొక్క (మొదటనున్నది) వలెనే నవలా ప్రక్రియ కూడ పాశ్చాత్యోపజ్ఞము కానిది. అంట్లు కట్టడంలాటిది మాత్రం మనది కాకపోవచ్చునేమో!. మన ప్రాచ్య సాహిత్య ప్రక్రియలన్నిటికీ కీర్తి, ధనం, వ్యవహార జ్ఞానం, శుభం, ఆనందం, సమాజ కల్యాణం పరమావధులు. బహుశః పాశ్చాత్యుల సాహిత్యానికి వీటిల్లో యేదో వొకటి లేదా మరొకటి పరమావధి కావచ్చును. సంస్కృతంలో కాదంబరి,దశకుమార చరిత్ర తెనుగులో కళాపూర్ణోదయము మొదలైనవి నేటి నవలల మొదటి స్వరూపానికి ఆధారాలని భావింపవచ్చు. పద్యం కంటె గద్యం, గ్రాంథికం కంటె వ్యావహారికం, జన సామాన్యానికి అందుబాటులో వుండడం కూడా, విభిన్న విచిత్ర మనస్తత్వాలు కల మనుష్యుల అధికారి భేదాన్ని బట్టి రుచించవచ్చు. మారవచ్చు. ఏ కావ్యమైనా సమాజానికిచ్చే సందేశం విలువని బట్టి, దేశకాలాల్ని బట్టి, మారుతున్న నాగరిక తాగులని బట్టి మారుతుంది. అంటే దాని విలువ మారదు. మారిన దేశకాలాలల్ని బట్టి మనం మారి అదే మారిందని భ్రాంతిపడుతున్నాం.

నవల అనేది పటిష్ఠమైంది కాదు చాలా వదులుగా వుండేది అని సోమర్ సెట్ మామ్ చెప్పినట్లు దానితో మనం దేన్నైనా సాధించవచ్చునీ,అది అపరిపక్వమైన కళా స్వరూపం అని అన్నారు సోమసుందర్ గారు. అంటే నవల శ్రవ్య దృశ్య కావ్యాల బంధం కంటె సరళమైందీ మరింత విశాలభూమీ అని ఆయన అభిప్రాయం. ఇంకా అందులో పరిపక్వత సాధించాలి అని కూడా అంటున్నారు. ఇట్టి స్థితిలో వర్తమాన యాంత్రిక యుగం సాధించిన విజయాల్లో నవలా ప్రక్రియ వొకటి దాంట్లో పాశ్చాత్యులే చాలామంది వున్నారు అని అన్నారు. పెట్టుబడిదారీ వ్యవస్థ అనేది సాహిత్యానికి నవలను ప్రసాదించింది అనీ అన్నారు. ఇదంతా యేలావుందంటే చిన్నమాటలో చెప్పితే సొరుగింటి పుల్లకూర రుచి అన్నట్లుంది, మన సన్నివేశాలు, పాత్రలు పరిసరాలు మొదలైనవన్నీ భారతీయాలు. సిద్ధాంతాలు వగైరా ప్రాచ్యభిన్నములు. ఈ మాట వస్తు విచారణలో ఉపయోగించేది కాదు.

సోమర్ సెట్ మామ్ చెప్పిన యీ వదులుతనం వలన 'రచయిత తన జ్ఞాన సర్వస్వాన్నీ యిందులో నిక్షేపించి; ఆత్మసంయమమూ, ఔచితీ, నిగ్రహమూ కోల్పోయి

రచన చేస్తాడు. దానికి నలభైరేళ్ళ క్రితం వచ్చిన వేయిపడగలు నారాయణరావు అనే రెండు నవల లుదాహరణ' అని అన్నారు. వీనికి ఆంధ్ర విశ్వవిద్యాలయం బహుమానం యివ్వబోయిందన్న విషయం (ఇవ్వడం కాదు. ఆ నవలలు పుట్టిందే విశ్వకళాపరిషత్తులో నవలల పోటీకి) గమనించివుండరు. కాలాతీత వ్యక్తులు రచించిన రచయిత్రిగారే కాబోలు-వారి పేరూ యిదే- శ్రీ విశ్వనాథవారి షష్టిపూర్తికి అంటే సుమారు 25 సంవత్సరాల క్రితం గుడివాడ సభలో వేయిపడగలపై ఒక విమర్శనాత్మక వ్యాసం చదివారు. ఇంతేకాదు, వరంగల్లు మొదలైనచోట్ల శ్రీ విశ్వనాథవారి పీఠం ఏర్పాటుచేసి సోమసుందర్ ఆక్షేపించిన వేయిపడగలపై కూడా బాగుందని విమర్శిస్తూ వ్యాసాలు వగైరాలు చాలామంది వెలువరించారు. రచనా సమయంలో రచయితకి లేక కవికి ప్రత్యేకత-విభిన్నత-నిర్లిప్తత వుంటుందా? మనప్రాచ్యుల సిద్ధాంతం ప్రకారం 'సరస్వత్యైవైషా ఘటయతి' మరి పాశ్చాత్యుల సిద్ధాంతం ప్రకారం కవి విభిన్నుడై అన్నిటికీ వేరుగా నిలిచి రచిస్తాడేమో తెలియదు. అలా రచిస్తే కవి అవుతాడేమో తెలియదు. నేను రచించా ననుకుంటే వాడు కవి కాడు. వారు చెప్పిన యాంత్రిక యుగంలోని కవి అవుతాడేమో? నలభైయేళ్ళ క్రితం వచ్చిన ఆ రెండు నవలలూ యివాళ సంసార వృక్షమువలన గుర్తుకు వచ్చాయంటే కారణం అగ్రంగావడం లేదు కాని ఆరెండూ యిన్నేళ్ళవరకు (వారికి స్మరణకు వచ్చేట్టుగా)వుండడమే వాటి మనుగడికి ఉదాహరణం. (అన్నీ లైబ్రరీల్లోనో లేక ఆ రచయితల అభిమానుల యిళ్లలోనో ఉండడం కాదు) అవి తరచు అచ్చుకావడానికి కాని ప్రశస్తి హేతువు. బహుశః నారాయణరావుని విశ్వవిద్యాలయ పరీక్షలకి పాఠ్యగ్రంథం చేశారు కాబోలు. ఇవన్నీ పక్షపాతంతో చేసినవీ విలువలేనివీ అంటారు. అవును ఇంత పెద్ద అకాడమీయే మనకు వచ్చిన నవలకి బహుమతి యివ్వకముందు పనికిమాలినదీ, పక్షపాత భూయిష్ఠమైనదీ అయి, తీరా అభిమాన రచయిత గ్రంథానికి బహుమతి నిచ్చేటప్పటికి మంచిదీ అయ్యేమరి. మన మనస్సునిబట్టి మనుష్యులే కాక అకాడమీలని, విశ్వవిద్యాలయాలనీ విలువితే ప్రపంచాన్ని మార్చేవారమే మనం.

రచయిత్రులు సాహిత్యాన్ని విశేషించి నవలాప్రపంచాన్ని పాడుచేశా రని అన్నారు. నవలాలకి నవలలమీద వున్నంత అధికారం మనకివుందా? వారన్నట్లు సర్వసమగ్రానందం అనేది కావ్యానికి (ఆదేనవలకి) పరమావధి అయితే ఆటువంటిఆనందం వేయిపడగలు, నారాయణరావులలో కొరవడి, సంసారవృక్షంలో సర్వసమగ్రంగా వుందా? సర్వసమగ్ర సంతోషం శివసాహిత్యం శృంగారసాహిత్యం చాలామందికి కలిగిస్తాయి. గుణాత్మకం అంటే యేరూపమైన గుణం? యెవరికి, అభిమానులకా, సహృదయులకా, సామాన్యపాఠకులకా? ఏమైనా నవలాల నవలా సాహిత్యాన్ని అకారణంగా సంసారవృక్షాన్ని విమర్శించే సందర్భంలో విమర్శించడం బాగులేదు. రచనా విమర్శలో మితిమీరి అతివ్యాప్తి దోషంతో జరగే విమర్శ అనుచితమే అవుతుంది. అకాడమీని దుష్ట గ్రంథాలని పురస్కరించే అకాడమీని మన

అభిమాన సంసారవృక్షానికి బహుమానం యిచ్చిందని మెచ్చుకోవడం సంసారవృక్ష రచయితని మెచ్చుకున్నట్లా ? నిందించినట్లా? గ్రంథం విలువని కట్టడానికి సాహిత్యేతరశక్తులు పూనుకుంటున్నా యని అనడంకూడా స్వవచన వ్యాఘాతంగానే వుంది.

రచయితమీద రచనమీద పాఠకుల రుచిభేదాన్ని బట్టి యిష్టానిష్టా లుండవచ్చు. కాని దేనిని విమర్శిస్తున్నామో దాని పరిమితికి మించి వ్యవహరించడం విమర్శ అనిపించుకోదు. శ్రీ సోమసుందర్ చెప్పారే ఆ రెండు నవలలలో ఆరచయితలు చేశారనే దోషం, జ్ఞానసర్వస్వం నిక్షేపించాలన్న తాపత్రయం తమలోనూ వున్నట్లే. తామితరుల నాక్షేపించడం యేమిటి? గుర్రాజు పెళ్ళిలో సర్రాజుకో పోగు అన్నట్లుండ కూడదు విమర్శ. విమర్శ అతివ్యాప్తి అవ్యాప్తి దోషరహితమై విస్పష్టంగా వుండాలి. వేయిపడగలూ నారాయణరావూ నచ్చకపోవచ్చు. దానికేమి నచ్చితీరాలని జీవోలేమీ లేదు ఎవరి రుచిభేదం వారిది. కావాలంటే ప్రత్యేకంగా ఆ రెండింటి మీదా వేర్వేరుగానో సంయుక్తంగానో విమర్శ వ్రాయవచ్చును. అది బాగుంటుంది. అంతే కాని సైంధవవధ సమయంలో సైంధవుడు కృపాశ్వత్థామాదులని నాటుచేసికొని బాణాలు విడిచినట్లు శ్రీ సుదర్శనంగారి సంసారవృక్ష పరామర్శలో యిలా విసరడం విమర్శకునకూ, వారికీ, సహృదయులకీ మేలు కాజాలదు. సంసారవృక్షానికీ వేయిపడగలకీ, నారాయణరావుకీ సంబంధం యేమిటి ? సంసారవృక్షానికి స్వర్గీయ గంగాధరం గారి స్మారక పురస్కారం లభించి దన్నారు చాలా సంతోషం. ఇంకా మరిన్ని బహుమతులు రావాలనే నా కోరిక. వస్తాయికూడా. అప్పుడు వారు డబ్బయినిమిషాల దీర్ఘోపన్యాసం యిచ్చామన్నారు. ఆ వ్యాసంలో యింతకుముందు తెలిపినట్టిదేనా ? లేక సంసారవృక్షాన్ని గురించా ?

విమర్శలో వేయిపడగలు, నారాయణరావు, రచయిత్రులు, అకాడమీల నింద మంచిదికాదు. విమర్శ సహృదయపూరితగా వుండాలికాని అభిమానుల్ని పైకెత్తేస్తూ గుర్తుకు వచ్చినవారిని నిందచేస్తూ విషయసంబంధం లేకుండా వుండరాదు. ఈ విషయంలో అభిమాన రచయితగారి అభిప్రాయం తెలుసుకొని చూడవచ్చును. సందర్భరహితములైన విమర్శలు రచయితకుగాని విమర్శకునకు గాని సహృదయ పాఠకులకు గాని సహాయకారులు కావు. అప్రసక్తములైన వాటి విమర్శ రాగూడదన్నపుడు మితిమీరుట మరింత యనౌచిత్యము.

సంసారవృక్షముపై విమర్శను వాయిదా వేసితిని. ఇట్టి పాక్షికములు, అనుచితములు, అయిన విమర్శనాపద్ధతులను మాని నిర్వ్యాక్రము సరళముతయిన మార్గంలో విమర్శించడం మంచిది. కావాలనుకుంటే రచయిత్రుల్ని వేయిపడగల్ని, నారాయణరావుని, అకాడెమీలనీ సక్రమంగా సోదాహరణంగా వేరే ప్రత్యేకంగా విమర్శించుట యుక్తతరము. ఈపద్ధతి మంచిదికాదని సహృదయుల పక్షాన విజ్ఞప్తి చేస్తున్నాను. పాక్షికదృష్టితోగాని మితిమీరిన విధానములోగాని కాక ఔచిత్యముమీరని విధాన సంసారవృక్ష విమర్శనను కొలదికాలములో ప్రచురణ కీయగలను. — శ్రీ సుప్రసన్న.

# హేమంత సంక్రాంతి!

— ఆచార్య భావన్, ఎం. ఏ.
తెలుగుశాఖ, ఆంధ్ర విశ్వవిద్యాలయం.

హిమము వర్షించెడివేళ
తమము వీడెడివేళ
వెలుగువనిత తొంగిచూచెడివేళ
కలకూజితములు శ్రవణపుటముల సోకెడివేళ
హర్ష హృదయాల నధివసించె
శ్రీమంతమా హేమంత సంక్రాంతి !
రమణుల రంగవల్లులు రహిమించెడివేళ
పసుపు కుంకుమల సిరులు శోభించెడివేళ
పుష్పాలంకృత గొబ్బిముత్తైదువలు కొలువుదీరెడివేళ
గోమాతలు పూజ లందుకొనెడి వేళ ...
ముద్దబంతులు ద్వారాల మరులు గొలిపెడివేళ
చేమంతులు ఇంతుల కురుల కులికెడివేళ
గాజుల గలగలలు సందడించెడివేళ
నవ్యాంబరాభరణాల పరువాలు పసలూరించెడివేళ ...
హరిదాసుల హరికీర్తనలు మిన్నుముట్టెడివేళ
బసవన్నల కాలిగజ్జెలు 'ఘల్లు' న మ్రోగెడివేళ
మంగళతూర్యముల మహి నుంజులమై యొప్పెడివేళ
దానధర్మ సౌరభాలు దిగంతాల గుప్పెడివేళ ...
నూతన దంపతుల నవానురాగాల ననలు విచ్చుకొనెడివేళ
పిన్నపెద్దల ఆనంద భావాలు అధిగమించెడివేళ
ఇష్టమృష్టాన్న సంపదలు సంతృప్తిని సంతరించెడివేళ
బొమ్మలకొలువుల - ఆటపాటల బాలబాలికలు క్రీడించెడివేళ ...
మేషయుద్ధాలు మనసు నలరించెడివేళ
కోడిపుంజుల కవ్వింపులు కనులవిం దొనరించెడివేళ
జూదాలతో జగము మైమరచి జోగెడివేళ ...
ఎటుజూచిన చైతన్యము చిందులు తొక్కెడివేళ
ఎటుజూచిన ఆంధ్రత్వము స్వేచ్ఛగ విహరించెడివేళ
ఎటుజూచిన జాతి సంప్రదాయపు ఏరులు ప్రవహించెడివేళ
ఎటుజూచిన ప్రజావాహినీ ప్రమోదపుష్పములు వికసించెడివేళ
హర్ష హృదయాల నధివసించె
శ్రీమంతమా నీమకర సంక్రాంతి !

# రాజకీయ సంక్షోభము

ఈ సంవత్సరారంభము నుండి దేశ వ్యాప్తముగాను రాష్ట్ర పరిధులలోను, రాజకీయ సంచలనం ఉధృతంగా చెలరేగింది. ఒకవంక అమెరికా అధ్యక్షులు, బ్రిటిషు ప్రధాని భారతదేశాన్ని సందర్శించి సుహృద్భావ సంబంధాలని పెంపొందించుకోవడానికి ప్రయత్నించడం కొంతవరకు శుభావహంగా తోస్తున్నది.

మొన్న మొన్నటి వరకు పాలకపక్షమైన కాంగ్రెసు సంకుచిత స్వభావ కారణాల వల్ల నిలువునా చీలిపోవడంతో దేశ రాజకీయ వాతావరణం కలుషితమైపోయింది. ఇతర రాజకీయ పక్షాలయినా అందుకు పూర్తిగా భిన్నంగా నడుస్తున్నాయని చెప్పలేం. కొన్ని రాష్ట్రాలలో శాసన సభల ఎన్నికలు కొలది కాలంలో జరగనుండగా ఇట్టి సంక్షోభం తలెత్తడం దేశ క్షేమానికి ఎటువంటి పరిణామాలు కలుగుతాయా అనిపించక మానదు. అన్ని రాజకీయ పక్షాలూ ప్రజాస్వామ్య విధానౌన్నత్యమును గురించి గొంతెత్తి ఘోషిస్తూనే ఉన్నాయి. ఆదర్శాలూ ఉత్తమలక్ష్యాలూ మాటలలో ధ్వనించడమే కాని క్రియలో శూన్యమే గోచరిస్తున్నది. పార్టీ మార్పిడులు, వాగ్దానాలూ, పరనిందలూ, పదవీ వ్యామోహాలూ, బేరసారాలూ, పంపకపు టాలోచనలూ విరివిగా సాగిపోతున్నాయి. ఏ పార్టీకీ నిర్దిష్టమైన నిర్దుష్టమైన సిద్ధాంతాలూ, వాటిని నిష్కర్షగా అమలుజరిపే చిత్తశుద్ధీ, మృగ్యమై పోతున్నాయి. స్వశక్తి మీదకంటె పరుల బలహీనతమీద ఆశాసౌధాలు నిర్మించుకొనే బలహీనతత్త్వం పెచ్చుపెరిగిపోతూ వున్నది. కుల మత ప్రసక్తి విస్తృతంగా పరిశీలింపబడుచున్నది. దౌర్జన్యపూరిత, బలప్రదర్శనలు కూడా జరగడానికి అవకాశం లేదు అనలేకుండా ఉన్నాము.

ఎలెక్షనులలో పోటిచేసే అర్హతలలో తప్పకుండా గెలిచే స్తోమతు ఉండడం ముఖ్యఅర్హతగా అన్ని పార్టీల వారూ భావిస్తూండడం గమనింపదగ్గది. అపమార్గములలో గెలవడం కంటే ఓడిపోవడానికైనా సిద్ధపడి పరిశుద్ధ సిద్ధాంతాలతో పరిశుద్ధ విధానాలతో పోటీచేసే ఆలోచన కొలది మందిలోనైనా కనబడదు. ప్రజా సేవకి పదవి ఒక్కటే ఉత్తమ మార్గంఅనీ, అందునా మంత్రిపదవిఅత్యంత ముఖ్యంఅనీ, అదిసాధించడానికి ఎట్టి కుచ్చితపు మార్గాన్నైనా అవలంబించక తప్పదనీ భావించని అభ్యర్థి ఇంచుమించుగా ఒక్కరూ కనబడరంటే ఆశ్చర్య పడవలసిన పనిలేదు.

అయితే ఓటర్లు నిరక్షరాస్యులైనా, విద్యాధికులైనా, సామాన్యులైనా ఎటువంటివారికి ఓటు వేయాలనే విషయంలో కొంచె వివేచనాయుతంగా ఆలోచించే స్థితిలో కొంతవరకు ఉన్నారనే విషయం కొంత ఆశావహంగాఉన్నది. వ్యక్తిగతంగా చాల అంశాలలో ఉత్తమ శీలం గల వ్యక్తులు కొందరైనా ఎన్నుకోబడటానికి దీనివల్ల కొంత అవకాశం కల్పిస్తున్నది. శాసన సభ్యులుగా ఎన్నుకోబడటానికి కావలసిన ముఖ్య లక్షణాలని గురించి ముందుముందు కొంచెం చర్చించగలం.

— సంపాదకుడు.

# ఈ పక్షంలో

## సాహిత్య సభ :

1-1-1978 తేదీని రాజమండ్రి హాసాగుక్లబ్బు యాజమాన్యమున శ్రీమతి లక్ష్మీనరసమ్మ కాన్వెంటు స్కూలులో సాహిత్య సభ జరిగినది. సభకు విద్వాన్ శ్రీ బులుసు సీతారామశాస్త్రి గారు అధ్యక్షత వహించారు.

ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల ప్రిన్సిపాలు భాషాప్రవీణ, విద్యాప్రవీణ **S T P V** కోనప్పాచార్యులుగారు భవభూతి ఉత్తర రామచరితమును గురించి సుమారు రెండు గంటలసేపు మహోపన్యాస మొసగిరి. ఉత్తర రామచరిత మందలి రసము కరుణ రసమే యనిరి. వీర శృంగారములలో నొకటి ప్రధాన రసముగా నుండవలెనను లక్షణము శాస్త్రాన తప్పకుండ పాటింపనక్కర లేదనిరి. లక్ష్యములను బట్టి లక్షణము లేర్పడుచుండే క్రమ విధాన మనిరి. రామాయణ-నాటక కథల భేదమును, అందలి ఔచిత్యమును, వివరించిరి. ముఖ్య శ్లోకము లందలి రసభావములను విశదీకరించిరి.

అధ్యక్షులు మాటలాడుచు భవభూతి మహా పండితుడు, మహా కవియు ననిరి. ఉత్తర రామచరితము మాట చెప్పగనే 'తేహి నో దివసా గతాః, యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః, లౌకికానాం హి సాధూనాం అర్థం వాగనువర్తతే, ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోను ధావతి, యేన వా జానకీ మపి ఆరాధనాయ లోకస్య మోక్తుం నవ్యథతే మనః -- మున్నగు లోకోత్తర సూక్తులు స్మృతికి వచ్చుననిరి. ఉత్తర రామచరిత రచనానంతరమే లాక్షణికు లెవరైనా కరుణము కూడ ప్రధానరసము కావచ్చునని నిబంధించిరేమో పరిశీలింపవలసి యున్నదనిరి.

## మహాకవయిత్రి అస్తమయం :

31-12-77 తేదీని మహాకవయిత్రి కవిసార్వభౌమ పుత్రి కల్లూరి విశాలాక్షమ్మగారు డెబ్బది తొమ్మిదవ యేట విశాఖపట్టణములో కుమారుని సన్నిధిలో పరమ పదము జెందిరి. భారత కథామృతము మున్నగు ఉద్గ్రంథములను సుమారు నలుబదింటిని ప్రసన్న సుందర శైలిలో రచించి యనేక సన్మానములందిన విదుషీమణి విశాలాక్షమ్మగారు. భగవంతు డామె కాత్మశాంతి ప్రసాదించు గాక.

## సన్మాన సభ :

బహుగ్రంథ రచయిత, విమర్శకుడు శ్రీ ఆర్.యస్. సుదర్శనం గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి ప్రిన్సిపాలు గారికి సీతంపేట ఉపగ్రంథాలయములో 8-1-78న ఘనమైన సన్మానము జరిగినది. ఇటీవల వారి 'సంసారవృక్షం' నవలకు ఆంధ్ర సాహిత్య అకాడమీ వారి బహుమానము లభించిన సందర్భమును పురస్కరించుకొని యీ సన్మానం జరిగినది. ప్రముఖులనేకులు వారి వివిధ గ్రంథముల ఉత్కృష్టతను సోదాహరణ విమర్శ పూర్వకంగా ప్రస్తుతించిరి.

---

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ, విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష.

రచన మాకుఁ జేరిన వారమురోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలా స్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్త పుస్తకములను రెవ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు. పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంతవఱకు రెవ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు.



### —* ప్రకటన రేట్లు *—

| | |
|---|---|
| పూర్తి పేజీ | రు. 40 - 00 |
| $\frac{1}{2}$ పేజీ | రు. 25 - 00 |
| $\frac{1}{4}$ పేజీ | రు. 15 - 00 |
| $\frac{1}{8}$ పేజీ | రు. 8 - 00 |

వివరములకు ఎడిటరు & పబ్లిషరు పేర వ్రాయండి.

Regd. No. H/Rmy-42.     Samalochana 16, Jan. 1978

# ఉద్గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1) | నిర్వచన మహాభారతము (పదునెనిమిది పర్వములు) | రు. | 50—00 |
| 2) | నిర్వచన అధ్యాత్మ రామాయణము | రు. | 20—00 |
| 3) | నిర్వచన మహాభాగవతము | రు. | 30—00 |
| 4) | శ్రీ వేంకటేశ్వర విజయము | రు. | 25—00 |
| 5) | కుందమాల నాటకము | రు. | 5—00 |
| 6) | వేణీ సంహార నాటకము | రు. | 5—00 |
| 7) | గీత రామాయణము<br>వాల్మీకమునకు గీతములు (అచ్చులో) | | |
| 8) | దేవీ భాగవతము ,, | | |
| 9) | శతక సంపుటములు ఒక్కొక్కటి | రు. | 5—00 |

కృతికర్త : ప్రకాశకుడు :

**బులుసు వేంకటేశ్వరులు,** ఎం. ఏ.

10-5-5 రామారావుపేట, కాకినాడ-4.

---

**Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co. Press, Innispet, Rajahmundry-1.**